శ్రీ

కృష్ణగురు బ్రహ్మణేనమః.

# పృథ్వీరాజవిజయము.

నాంది

మ॥ పరదారారతులన్ దురూహయుతులన్ బాపాంశసంభూతులన్
నరగోబ్రాహ్మణ ఘాతుక వ్రతతులన్ భామాప్రజోన్మూలురన్
ఖరసంకాశుల నెల్లఁ గూల్చి ప్రజకున్ గల్యాణముం గూర్చు నిం
దిరచిత్తాంబుజ భాస్కరుండయిన, పృథ్వీరాజు మిమ్మేలుతన్.

(సభవంకఁదిరిగి పుష్పాంజలిచల్లి)

"చీరెసింగారించినంతఁ బట్టణము కొల్లబోయినదన్నట్లు" ఇప్ప టికి జాముఁరాత్రియైనను, ప్రియసీయలంకారము ముగియనేలేదు.

(నటిప్రవేశించి)

నటి—ఆర్యపుత్రా! మీముఖారవిందము సరాగమైయున్నదే! బాలకా కరతాడనము చేతనా యేమి?

సూత్ర—(కోపముతో) తడయుటయేగాక, పరిహాసములు కూడనా!

నటి—ఇందుఁ బరిహాసమేమున్నది? బాలకులచే సందడుల మీరుకాల మతిక్రమించినదని యెంచి నాపై గినుకఁబూనితిరేమో, యని యంటి.

సూత్ర—అవును కాలాతిక్రమణకాలేదా!

నటి—ఆర్యపుత్రా! బాలకుల సహజచాపల్యము మీడెందము సందడింపఁజేసెనేకాని, కాలచక్రముగూడఁ ద్రిప్పెననుకొంటిరా!

సూత్ర—సరే! మాటలతోఁ బొద్దుబుచ్చనేల? కర్తవ్యమునకుఁగడం గుదము.

నటి—పాత్రలుసిద్ధము గావలదా?

సూత్ర—ఇంకను గానేలేదా?

నటి—ప్రదర్శింపఁబోవు నాటకమేదియో నాకుఁదెలుపకయే, ఇంకను గాలేదా! అనియాతురతఁ బడెదరేల?

సూత్ర—సరి! సరి! నీకుఁదెలియు ననుకొంటిని, "పృథ్వీరాజవిజయమని"

నటి—చెప్పకయే తెలియునా; పోనిండు; పృథ్వీరాజన రాణీసంయుక్త భర్తయేకదా!

సూత్ర—కాదు, కాదు, ఆపృథ్వీరాజీతఁడుగాడు. మేవాడ్మహీమండల మహారాణాయగు రాయమల్లునిపుత్త్రుఁడు.

నటి—సరిసరి, తెలిసినది. తారాబాయిని పరిణయమాడిన వీరపురుషుని చరితమా; ఇప్పుడుప్రదర్శింపఁబోవునది? అద్దాని రచించిన క[illegible]మెయ్యది?

సూత్ర—చెప్పెదవినుము.

తే॥ గీ॥ చిఱుతతనమందె కవితంబుఁ ♦ జెప్ప నేర్చి
కవులమన్ననలనుగాంచఁ ♦ గలిగినట్టి
దేవినేన్వంశసంభవుఁ ♦ డో వరాంగి!
వీరరాఘవ కవియంద్రుఁ ♦ విబుధులెల్ల.

మఱియు,

చం॥ కవికులభూషణుండు, బుధ♦గౌరవపాత్రుఁడు సూరయాఖ్యుఁడీ
కవికిన సోదరుండ పటె ♦ కాక, గురూత్తముఁడయ్యె;

నటి— నెట్టెటూ?

సూత్ర- నవరసపూరితంబయిన♦ నాటకముల్ రచియించి కృష్ణభూ
ధవుఁగృతినాథుఁజేసిన యు♦తండు సహోదరుఁడౌనె? వీనికిఁ

నటి- అటులనా! అటులైన నీనాటకమూలమ్మున సభాసదుల నమందానంద మొదించుట కొక్కింతయు సందియముండదనియే నా యభిప్రాయము.

సూత్ర- అవును (అనిగడియారముఁజూచి) చెలీ! మనమీప్రస్తావన
మూలమున్ననఁ బ్రస్తుతవిషయము మఱచితిమి. ఇప్పటికే కాల
మతిక్రమించినది. ఇఁక లోనికరిగి పాత్రలను సిద్ధపరపుము.

నటి- చిత్తము. (నిష్క్రమించును)

సూత్ర- (సభ్యుల నవలోకించి)

సభాసదులారా!

చం॥ నవరసపూరితంబులగు ♦ నాటకముల్ రచియించు గార్యమా!
కవులది; తత్ప్రదర్శనపుఁ ♦ గౌశలముంగనుపట్టు భారమా!
యువనిని నాటకస్థులది; ♦ యందు రసారసచర్చయా! రస
జ్ఞవరులరైన మీయ దటు ♦ గాన మముఁ గృపనాదరింపుఁడీ.

[ అని నిష్క్రమించును. ]

ఇది

ప్రస్తావన.

శ్రీ

కృష్ణపరబ్రహ్మణేనమః

# పృథ్వీరాజవిజయము.

## ప్రథమాంకము.

[వేదనగర బాహ్యప్రదేశము, రాజానందయోగి ప్రవేశము]

ఆహా! మహీమండలం బంతయు విషాదపూరితంబగు నాహృదయసీమవలెనే యంధకార బంధురంబై యున్నది.

ఆ॥ వె॥ కన్నుఁబోడుచుకొన్నఁ ♦ గానరానీక యీ
కనులజాండమెల్లఁ ♦ గప్పె నిరులు
అడవికేఁగ నిదియె ♦ యదనటంచును దోఁచుఁ
బతినిఁ బ్రాణసఖిని ♦ బడయుకొఱకు.

ఆహా! కాలచక్రమెంతలో నెంతమాఱినది! దుర్గా! నీవును కాలచక్రముతోఁబాటుమారి, యొక మహానాయిక వైతివిగదా! బహిర్దేశమా! నీ వెంతటిదానవు! నీయనుగ్రహంబునఁగదా! తుచ్ఛులగు నా మ్లేచ్ఛులబారినుండి సురక్షితముగా వచ్చితిని. [అటు నిటు చూచి] కట్టా! ఈ యంధకారముఁజూడ నించుక భీతి జనించుచున్నది.

మ॥ అరయంగ్ గోనికరాగ్రజన్మ శిశుహ ♦ త్యాదోష సంకల్పులా
ఖరచిత్తుల్ యవనావనీధవచయా ♦ క్రాంతాప్రతిష్ఠాయనన్
ధరణీచక్రముఁగప్పెఁ జీఁకటులహో! ♦ దారుల్గనన్ బట్టవె
క్కురణిన్ బోయెద నర్ధరాత్ర మిపుడో! ♦ కాళీ! కృపన్ జూడవే!

[మఱల నటు నిటు జూచి] మ్లేచ్ఛ పిశాచములెవ్వియైన నా మాయోపాయము నెఱింగి, జాడలఁదీయుటకై, వచ్చుచుండ లేదుగదా! మధుపానమత్తాంధులగుటయేగాక గాఢనిద్రావేశులైయున్న యాఁచుల

కిపుడు నా జాడయే కావలసివచ్చునా! [కొంచెము ముందుకు నడచి] భళిరా! ముందు నేఁగన్నటులనుండక యిరులిప్పుడించుక తఱఁగుచున్నట్లున్నవి. [ఆకాశమువంకఁజూచి] సింగిణీ చీరెవలె నంబరమెంతరామణీయకముగానున్నది.

తే॥ గీ॥ యామినీకాంత పతి వచ్చు ♦ నంచు నెంచి
యభినవాలంకృతులఁ దాల్చి ♦ యతఁడు రామిఁ
గుందుచును భూషలను దీసి ♦ కురులు విప్ప
రాలుమల్లెలు నా నుడుల్ ♦ ్రగాలుచుండె.

ఇపుడు దారులు కన్నులఁ గట్టినట్లు చక్కఁగాఁ గనంబడుచున్నవి. ఇఁక బయలువెడలుట శ్రేయస్కరము. కట్టా! మాతృస్థానమగు నీనగర మెట్లువిడుతును. నేనెచటఁ బుట్టి పెఱిగి, విద్యాబుద్ధులను నేర్చుకొని, తారాబాయి చెలిమి సంపాదించి సాటిబోటులలో మేటియనిపించుకొంటినో, యాపురవరంబు నే దురదృష్టవంతురాలనై, నేటికి వీడవలసివచ్చె. (పెదవి విఱచి) విడువ కేమున్నది?

సీ॥ ఘనశిల్పనైపుణ్య ♦ మును దెల్పు దేవళా
లానవాల్కయినను ♦ గానరావు
గణిత మాయుర్వైద్య ♦ కార్ముక శాస్త్రముల్
దవులఁబెట్టిరి పెద్ద ♦ తంపటులఁగ
సన్మార్గులును సర్వ ♦ శాస్త్రజ్ఞులును నగు
నవనీసురులఁ బంపి ♦ రమరపురికి
మానవతీతతి ♦ మర్యాద లెల్లను
గల్పుచుండిరి నీటఁ ♦ గఠినమతులు
తే॥ గీ॥ నగరుఁ దలరావణుండైనఁ ♦ గఱకుదురక
చెఱుపులను జేయ లేదని ♦ చెప్పవచ్చు
నెంత్రవఱ కింక నీమ్లేచ్ఛ ♦ సంతతులకు
దాసులుగ నుండవలయునో! ♦ దైవరాయ!!

అక్కటా ! వేదనగరలక్ష్మినిం దలంచుకొన్న గుండె గుభిల్లుమన కుండునా !

చ॥ పతియెడఁబాటుచే నెద న ♦ పార విచారముగూడఁగా నలం
కృతులను దీయు మానవతి ♦ రీతిని నాథుఁడు దూరమౌట ను
న్నత ఘనసౌధరాజి విడ ♦ నాడి యలంకృతులైన దేవళాల్
గతిచెడి చిన్నఁబోయి పుర ♦ కాంతమనంబునఁ గాననయ్యెడిన్.

[విచారించి] "కొండవంటి రెడ్డిపోఁగా గొఱ్ఱెకొఱికా" చింతించుట యనునట్లు భర్తృవియోగమునకంటె నీపురవియోగమెక్కుడు విచారదాయకమగునా! అక్కటా! నా యిక్కట్టులన్నియు నొక్కసారి జ్ఞప్తికివచ్చి నాహృదయక్షేత్రమును భేదించుచున్నవి. దైవమా! నీవు కపటనాటక సూత్రధారుఁడవు సుమా! కాకున్నచో నాప్రాణేశ్వరు నెడఁబాపి నా కీ చిత్రవేష మేల గల్పింతువు? బ్రహ్మాండంబునం గల ప్రాణికోటి యంతటిలో నీకంటికి నేనే గన్పట్టితినా! పతికిఁ బన్నంబులఁ గల్పించితివిపో! ఆమనోహరుని కష్టసుఖములలో నా కేల పాలీయవు? హా! జీవితేశ్వరా! నేను గనుబడనందుల కెంత చింతలుచుంటివోకదా! కట్టా ముష్కరతురుష్కులచేఁ జిక్కి నెట్టి చెట్టలఁ బెట్టుచుండిరోకదా! హృదయమా! తొందర జెందకుము. అమంగళము నెంచకుము. నీనాథునకుఁ బ్రాణాపాయమే కలిగినచోఁ బ్రాణ మింతదనుక నిల్చునా! నామదనమోహనుఁడు! నామనోహరుఁడే కొండొకరీతి యైనచో నీయుసురులు నన్నీపాటికే వీడవా! నా హృదయేశ్వరుఁడు కడు బరాక్రమవంతుఁ డగుటయే గాక, మిక్కిలి చతురుఁడును, నయశాలి యగుటచే, నా తురుష్కవాహినిం దాటి, యెందేని జని యుండనోపు. రాజభక్తికిఁ బ్రోవయిన నా నాథుఁ డూరకుండునా! స్వరాజ్య సంపాదనార్థ మేదైనఁ బన్నుగడ బన్నుచునే యుండును. సౌందర్యవిజితమదనా! కువలయ హితుం డవగు నీ సుందరవదనేందుబింబసందర్శనంబు గలిగినప్పుడుగదా!

భవద్వియోగభవక్లేశాంధకారాక్రాంతంబగు మచ్చిత్తకువలయంబు వికసించుట ! కాళీ ! భావసంభృతశూలీ ! పాలితభక్తాళీ ! నానాథుని పునర్దర్శన మచిరకాలములోఁ గలుగఁజేతువుగాక.

(కొంతసేపు యోజించి) కట్టా ! మఱచినను మఱపు రాకున్నదికదా ! పతివియోగసంజనితసంతాపసాగరముం దాటితిగదా యని చిత్తము గట్టిచేసికొన మఱల నా యనుఁగుంజెలియగు తారాబాయి జ్ఞప్తికి వచ్చుచున్నయది. తన పంచప్రాణములలో నొక ప్రాణముగా నెంచి, భూపాలపుత్త్రినను గర్వములేక, మిగుల నేకీభావముతో మెలఁగు నాతారం దలంచుకొన్న మది నపారవిచారము వొడము.

తే॥ గీ॥ పువ్వులం దునుమఁ జనిన ♦ భోజనంబు
సేయఁబోయిన నూత్నమా ♦ జేలములను
గట్టఁబోయిన దుర్గమ ♦ ర్గా యొనటంచుఁ
జీరు చెలి నెంచుచోఁ గడ్ప ♦ జెఱువుగాదె ?

ముష్కరతురుష్కులాయువతీమణి కేదయినఁ గీడెంచకుండినఁ గదా ! దైవమా ! ఆకన్నెమిన్నం జూచియైన నీకుఁ జాలివొడమదా ! మ్లేచ్ఛుల చిత్తమువలె నీహృదయమును గఠినపాషాణాకృతిఁ దాల్చెనా ! దిక్కులేనివారికి దేవుఁడే గతి యందురుగదా ! నీగతియు లేనివారి బ్రమకెట్లు ? దయామయుఁడవని మునిజనులు నిన్నుఁ బొగడుదురు. కాని, అది కేవల మభిమానముచేతఁ జుమీ ! ఔషధార్థమైన గరుణలేని నిన్ను దయామయుఁడ వనుటకన్న విరుద్ధ మేమున్నది ? [ఇంచుక యోజించి] ప్రమత్తురాలనై సర్వేశ్వరుం డగు భగవంతునే దూషింపుచుంటినే ! విరహిణీజనులు కువలయాహితుం డగు జంద్రుని దూరుసట్లు (ఆఁ అని తలనూఁపి) మొన్న నొకతక్షశిలా నగరవాసివలన శ్రీ సూరనాథుఁడును, తారాబాయియు, దత్పురమందే యుండిరనియు, నవాబున కాసంగతి తెలిసి, చారులఁ బంపి

నట్లును, కర్ణాకర్ణికగా వింటి. కట్టా! మఱల నా దుండగులు చేఁబడి రేనిఁ, బెక్కుబిక్కులం బడుదురు. నాసోదరి కెట్టి విపత్తులు రానున్నవో కదా!

తే॥ గీ॥ పరులభార్యలఁ గన్నచోఁ ♦ బట్టఁజూచుఁ
దులువ లాకన్నెఁ జూచిన ♦ దుండగములఁ
జేయకుందురె? యెట్టులీ ♦ చేటు, తప్పు
దారి తోఁచకయుండె ని ♦ త్తఱిని నాకు!

ఉ॥ ఇందిరయో యనందగు మ ♦ దీయ సహోదరి యందమందునన్
గ్రిందును మీఁదునుం గనరు ♦ క్రీడగదుష్కృతు లాచరింతు రా
పందలు మ్లేచ్ఛులా! కనిన ♦ బాలికఁగ్రైకొన నెంత్రుకాన నా
డెందము గుందుచుండె నరి ♦ డీకొననుండెను వెండి వారిపై.

నా యనుంగుచెలి ప్రాణ మాసింపని సాహసియు, మానధనియు నగుటచే నించుక స్వాంతము శాంతినొందుచున్నది. ఆలోచించి చూడ నావలెనే వారికిసహితి మరణమే శరణ్యమగుట నిక్కువము. ఎట్టికష్టములైన నలవాటుపడినచో నంత బాధకరములు కావుకదా!

క॥ విలపించిన ఫలమేమీ!
యలవడిన యనంతరంబ ♦ యన్నియు వోవున్
దలదడియ మునుఁగువానికిఁ
గలదే? చలిబాధ యరసి ♦ కన్గొన భువిలోన్.

కష్టములన్నియు నొక్కమారు స్మరణకు వచ్చుటచేఁ గాలయాపన మైనది. ఇఁక వేగిరంబ కర్తవ్యమునకుఁ గడంగుట శ్రేయస్కరంబు. చిత్తూరు సార్వభౌముండగు రాయమల్లుని, కుమారరత్నంబగు, పృథ్వీరాజ వీరాగ్రేసరుఁడు, వైరిశైల బలారియనియు, విక్రమనిర్జితారినుఁడనియు, ననేకమారులు వినియుంటిని. ఎటులైన నా మహామహు దర్శనభాగ్యము లభించినచో నీ చెండాలుర దుండగము లడంచుట

సులభసాధ్యము. ఆహా! భరతమాతా! నీ సంతానమునకెట్టి నిరంతరసంతాప సంతానము లుదయించె, కానిమ్ము,

మ॥ ఖలు లీమ్లేచ్ఛుల దుండగమ్ములడపం ♦ గా వీరులా రాజపు
త్రులిలు లేరంచుఁ దలంపకమ్మ! విలస ♦ ద్దోర్విక్రమప్రాభవుం
డిల మేవాడ్ధరణీధవుండయిన బ్ర ♦ ధ్వీరా జొకండుండ ను
త్తలపాటందఁగనేటి కో భరతమా ♦ తా! లోకసంపూజితా!

(అని నిష్క్రమించును.)

---

## ద్వి తీ య రం గ ము.

### అరణ్యము—భిల్లుల గూడెము.

### గంగానమ్మగుడి.

[సారాయిబుడ్లు, కల్లుకడవల బుచ్చుకొని భిల్లులు ప్రవేశము.]

1 టవ—ఒరే కేతిగా నాకింకో గలాచెయ్యెసే, అమ్మోరుమీంద పడ్దా లాడ్తాను.

2 డవ—ఉండోసే యెడ్డినాయాల, బలిమడిసిని మనోళ్లు యింకా తేలేను. అమ్మో రారగించందే మనం మొదలెడ్తాంయేంరా

3 డవ—పోలిగా యెనకచాల్లో బలియీటానికి బలేమడిచి దొర్కిం దిరా. వొల్లల్లా నగలేరా. అబ్బాయా! ఆమడిచి చెవుల్నిం డయ్యా చన్నపుబెత్తికలల్లే, తళతళలాడతా యేతమాచాగా నుంన్నైరా.

1 వ—ముక్కుల్నుంన్డై యొసే, యూందో మిరపతొక్కలల్లే.

2 వ—కేతిగా యేందోరా మమ్మోరుసత్తెం నాకాట్టె కనపట్టంలేదు. యెనకల్లా మనమీయేడు దోపిళ్ళు, బందెపోట్లు, బాగా దొర కాలనిగందా మొక్కుంది, యూందొరికినియిరా

1 వ—యాదనగరపు దొరోరుంటే నోట్లోమన్నేరా!

3 వ—అమ్మోచూరై గారు బల్చారుడుగాదంట్రా

4 వ—అవున్రాబాబూ యెన్కమామేనమామవని బల్లిమెట్టిడొక్క కుర్కిమొడిశాడు.

2 వ—చూరైదొరగారి పనైందిలేరా

3 వ—ఛోన్రో నేమర్చేపోయా, ఓళ్లోగెడ్డపాయనున్నాడ్రా

1 వ—యెడ్డినాయలా. గెడ్డపాయనగాదురా, చాయీబుగాదంట్రా

2 వ—నీకుషూ తెల్చిందిలేరా, నబాబోరుగాదంట్రా ఆడు

4 వ—రచ్చించాళ్లెఅయ్యా, చాయీబుదొరలుంటేనే మనాట్లుబాగా చాగుతై

3 వ—ఆళ్లుమాత్రం వూరుకుంటారంట్రా పిచ్చోడ,

2 వ—వూరుకోకేమిచేత్తార్రా, ఆళ్ళెప్పుడు మనకంటె యిబ్బిడిగా తాగి వొళ్లుతెల్వకుండా పడుంటమేగా

1 వ—అమ్మో! ఆళ్లెట్టాగన్నా బడవాలుగాదంట్రా, కత్తిమెడమీ దేసిమాట్లాడుతారు నాయాల్లు

3వ—కేతిగాయింకామనోల్లు దానటంలేదే, మనమ్మోయి తెద్దాందా వొసే,

2 వ—ఎల్దాందావొసే [అనియిద్దఱు నిష్క్రమింతురు]

4 వ—పోలిగాఆళ్లెల్లారుగాని, నాకొగ్గలా చెమ్మోసేయిప్పుడు [అనివారిదగ్గఱకుజేరి] దబ్బునెయ్యోసే నీకాల్కిమొక్కుతాను.

1 వ—కొంపదీత్తానంటావేంరో, ఆళ్లానమాలెట్టి కెల్లేదంట్రా

4 వ—ఆనమాల్లేదు. గీనమాల్లేదు అందులో కాసింనీళ్ళోద్దాం పొయ్యోసే [ఇంతలోనిష్క్రమించిన వారిద్దఱు లక్ష్మణభట్టను బ్రాహ్మణుని గొనివత్తురు]

1 } [గంతులువైచుచు] బలిమడిచినిదెచ్చారు మనోల్లుఅదుగోరో
4 }

2 } ఆగండిరామీారు, ఆమ్మోరిమీాద పద్దెమాద్దారి-మీారామడిచి
3 } కాల్లుచేతులుగట్టి, అక్కడబడెయ్యండిరా (అని)

తే॥ గీ॥ మేకపోతుల నిత్తుము ♦ మేలుగొఱ్ఱె
పోఁతులను, గత్తవోదున్న ♦ పోతులెపుడు
బలిగనిత్తుము సత్తెమ్మ ♦ బత్తితోడఁ
గరుణఁజూడుము తల్లి! మా ♦ కల్పవల్లి!!

3 వ—అంత కంటెలగాంచి అద్దానుసూడరా.

తే॥ గీ॥ కన్నెలనుదెచ్చి యిత్తుము ♦ కాన్కలుగను
పడుచుమగవాండ్రఁ దెత్తుము ♦ బలిగనీకు
దొంగతనములు, దోపిళ్లు ♦ దొరలయిండ్ల
బందిపోట్లను దొరకకా ♦ పాడుతల్లి!

4 వ—తల్లిమాంకాళా! నాకేంవద్దు, దొరచనా! నాకడుపునిండా
కల్లు నీళ్లు, మాయింటిదానికి పొట్టనిండా పుల్లనీళ్లు దొరికేటట్టు
చెయ్యమ్మా

1 వ—అమ్మా! నాకీడిక ల్లెచెయ్యనకొండెంకమ్మా.

[ రాజానందయోగి ప్రవేశము. ]

అల్లదే! అనతిదూరంబున నెవ్వియో కుటీరములగుపడు చున్నవి. [అని వెనుకకుఁ దిరిగిచూచి) వీరు భిల్లులవలె నున్నారు. ఏమిది! ఇట్లుగంతులు వైచుచుండిరే! ఓహో! తెలిసినది వీరిప్పుడమ్మవారి తిరునాళ్లఁ గావించుచుఁ దప్పద్రాగిరికాఁబోలు! అందొక నాగరకుఁడు గన్పించుచుండెనే! పాపమతని బలియిచ్చుటకుఁ దెచ్చిరి కాబోలు! నేనిప్పుడితని ప్రాణరక్షసేయువలయు. (అనిసమీా పించిన వెంటనే వారుచెల్లాచిదరై పారిపోవుదురు) ఆహా! వీరినే సమీాపించుటతోడనే పిక్కబలముఁజూపిరి. పాపమీాతఁడు గడగడ వడఁకు చుండెను. ఇతఁడు బ్రాహ్మణునివలెఁ దోఁచుచుండెను. (దగ్గఱి) భయముులేదులెండు.

లక్ష్మి—అమలగుణసాంద్రా! మునికులాబ్ధిచంద్రా! నాపాలిట దైవ ముతైన మీకు నమస్కార సహస్రంబులర్పించెద.

రాజా—అయ్యా! భరతఖండంబునందుఁ దురదృష్టుల దుండగంబులకే ప్రజలు నిలువనీడలేక యుండ నీభిల్లులు సైతమిట్లు దుర్మార్గంబుల ద్రొక్కుచుండిరా!

లక్ష్మి—ఆర్యా! యేమని చెప్పుదు! మీరువచ్చుట కింక నిముసమెడ మైనచో నన్నీపాటికా యమాలయ వాసింజేసి యుందురు.

రాజా—భగవంతుఁడు మీపాలినుండ మీకేకీడునుం గలుగదు.

లక్ష్మి—స్వామి! నాచరిత్రము దలఁచుకొన్న, నుపకారముఁజేయఁబోవు వానికపకారము సంభవించునను విబుధోక్తి స్ఫురింపుచున్నది.

రాజా—[స్వగతము] ఈయనమాటలనుజూడ నెద్దియోమహాపాప కృతి నెవ్వరికోచేయరాఁ దానిట్లుచిక్కువడినట్లు తోఁచుచు న్నది. [ప్రకాశముగా] అయ్యా! మీనివాసంబెయ్యది? ఇయ్య రణ్యమునందిట్లు వీరిపాల్బడఁ గారణమేమి?

లక్ష్మి—సంయమితిలకా! నానివాసము తక్షశిలానగరము. [అని అనుమానించుచుండును]

రాజా—అనుమానించెద రేల? చెప్పుఁడు. నావలనమీకేముప్పును గలుగదు.

లక్ష్మి—ప్రాణదాతలగు మీకువిన్నవించుటకు శంకయేల? [స్వగతము] మహానుభావుండగు నీసంయమీంద్రునకు నీయుదంతం బంతయు నెఱింగించిన, కీడుగలుగకుండుటయేగాక, మీదుమి క్కిలిమేలు చేకూఱుఁగలదు. కానవిన్నవించుటయే శ్రేయస్క రము. [ప్రకాశముగా] మునీంద్రా! వేదనగరప్రభువగు సూర నాథమహారాజొక నవాబుచేనోడింపఁబడి; స్వరాజ్యభ్రష్టుఁడై, లావణ్యరాశియగు దనపుత్త్రికారత్నముతో, తక్షశిలానగరమున కేతెంచి, మా గృహమునందే సామాన్యులరీతి వసింపుచుండిరి. ఇఁటనైన నెట్లో కాలముఁ గడుపవచ్చునని, యనుకొనుచుండ,

నేఁడే ద్రోహులో వారు తక్షశిలానగరమందున్నటుల, నా నవాబున కెఱిఁగింపఁగా నెగ్గులే యుగ్గుపాలుగాఁ ద్రావిన యా తురక దుండగీఁడు తన సేనల నాపురంబున కనిపె. శివ శివ! యాదుర్మార్గులు జేయు దుర్ణయంబులు పగవారలయిన ననుభవింపఁగూడనివి. ఇది చేయఁగూడుననియు, ఇది చేయఁగూడనిదనియు, విమర్శ లేక, యిచ్చవచ్చినట్లు, పెచ్చురేఁగి చెప్పరాని విధముల నేడ్పించు చుండిరి.

సీ॥ తల్లుల నెంచుచు ♦ గొల్లున నేడ్వంగ
బిడ్డల కుత్తుకల్ ♦ బిసుకుటొకటి,
సాధ్వీమతల్లులా ♦ పారసాక్షులఁబట్టి
విమతులై గొంతులు ♦ విఱుచుటొకటి,
బాడబుల్ గనుపింపఁ ♦ బట్టి బద్దలు జేసి
కుక్కమాంసము నోటఁ ♦ గ్రుక్కుటొకటి
సుప్రసిద్ధినిఁగన్న ♦ సొగసైన దేవళాల్
మట్టిపాల్సేయు దు ♦ ర్మార్గమొకటి
గీ॥ పుస్తకాగారముల నగ్ని ♦ పొత్తుఁ జేయు
టొకటి, మొదలగు దుష్కృతు ♦ లొగిసలుపుచుఁ
బాపమని మానసంబున ♦ భయము లేక
మెలఁగుచుండిరి పురజను ♦ ల్కలఁత బడఁగ.

రాజా—రాజును, రాజకుమార్తెయు నేమైరి? వారెటకేనిం జనిరా? సేమముగా నుండిరా?

లక్ష్మి—యోగివర్యా! విన్నవించెద. నాదుస్థితిఁగూడఁ జిత్తగింపుఁడు.

ఉ. సంతతి లేక లేక జల ♦ జాక్షు గటాక్షము చేతఁ గల్గె మా
వంతలు దీరెనంచుఁ గడు ♦ పార భుజింపుచునుండ నింతలో
నంతకురీతి మ్లేచ్ఛుఁడొకఁ ♦ డా పసిగందును గొంతుఁబట్టి బ
ల్వంతముగా నడంచెఁ దల ♦ బాయ నలోఁయని మేము నేడ్వఁగన్.

[అని దుఃఖించును]

రాజా— అయ్యా! ఊరడిల్లుఁడు గతించినదానికిఁ జింతింపఫలమేమి?

లక్ష్మి-స్వామీ! లేక లేక పుట్టిన పట్టియగుటచే దుఃఖమెంత యాఁపుకొనినను పొర్లి పొర్లి వచ్చుచున్నది. నాయును రెన్నటికైనను వారికిఁ దగులకపోదు.

రాజా-నిక్కముగా మీవాక్య మమోఘం బగును. మీవంటి బ్రాహ్మణోత్తముల హింసించువా రెన్నటి కైనం జెడకపోరు.

లక్ష్మి-అయ్యా! అంతటి భాగ్యమా!

రాజా-పొంగినపాలు పొయ్యిపా లగునట్లు, ఆదుర్జన సంఘంబునకు భంగంబు గలుగకపోదు. ఓ ముష్కర తురుష్కులారా! "వినాశకాలే విపరీతబుద్ధిః" అను విబుధోక్తి సరణి మీకు యమాతిథ్యప్రాప్తి చేకూరుటకే యిట్టి దుష్కృతు లొనరించుచుండితిరి. అయ్యా! వారి సంగతిఁ జెప్పరైరి.

లక్ష్మి-యతీంద్రా! ఏమని తెల్పుదును? నాపనికి "వెనుకకుఁ బోయిన నుయ్యి, ముందుకుఁ బోయిన గొయ్యి" అను సామెత రీతి నయ్యె. ఏకపుత్త్రీవియోగ శోకంబును దిగమ్రింగి, మెట్టులేని మనసు దిట్టపఱచుకొని, యీ నృపాలశేఖరుని పుత్త్రీ కాసహితంబుగా నీ తురుష్క శైవలినిం దాటించి, గట్టెక్కించుటయే కర్తవ్యముగాఁ దలఁపోసి, వారి నరణ్యమునకు బయలు వెడలుట శ్రేయస్కరం బని ప్రోత్సాహముఁ జేసితిని.

రాజా—ఆర్యా! "పరోపకారార్థ మిదం శరీర" మ్మను నీతిపాఠమును సార్థకపఱచితిరి. మిమ్మెంతయైనం గొనియాడఁదగును. వారు మీ శ్రేయస్కరోపాయమును సమ్మతించినారా?

లక్ష్మి—సమ్మతింప కేమున్నది! కాని, యుత్తమక్షత్రియ సంజాతయు, మూర్తీభవించిన శౌర్యరాశియు, నగు తారాబాయి కనులు చెవులం దూర, మహిషాసుర మర్దనివోలె యుద్ధమునకు సన్నిద్ధయయ్యె, గాని దూరాలోచనపరుం డగు నారాజవరుం

డిట్లనియె. అమ్మా ! నీవు బాల్యచాపల్యముచే ముందువెనుక లరయక, తొందరపడితివేని, గందరగోళమగును.
ఏమంటివేని,

ఉ. వైరిచమూబలంబిసుక ♦ పాతరలోయనునట్టులుండు నా
ఘోరరణంబునందు నను ♦ కూతుర ! నీవును, నేనుబోరి, సం
హారముఁజేయఁగల్గుదుమె ♦ యారిపువర్గమునంత గావునన్
వేరొకరీతి నీయరుల ♦ వీడుట యుత్తమమౌఁ గుమారికా !

రాజా– [ స్వగతము ] ప్రాణసఖీ! తారాబాయి ! వీరపుత్రివైనందు లకుఁ బేరునిల్పితివి. నీచరిత్రవిన రాణీసంయుక్త స్ఫురణకు వచ్చుచున్నది. నీవు నిజముగా సపర మహిషాసురమర్దనివే యగుదువు. ఏమైననేమి ? సమయప్రతికూలమగుటచే మి న్నకుండవలసి వచ్చినది. [ ప్రకాశముగా ] అయ్యా ! తరు వాత నేమిజరిగినది ?

లక్ష్మ– పిమ్మట నరణ్యమే శరణ్యముగా విశ్వసించుకొంటిమి. వారి ననుపుటకే నేనుగూడ నిటకరుదెంచితిని.

సీ. మంత్రి సామంతాది ♦ మహనీయులకు మారు
క్రూరమృగంబులు ♦ గొలువుసేయ,
నవరత్నఖచితమౌ ♦ నాణెంపు బీఠికిన్
బతిగ వల్మీకంబె ♦ గతిగ నలర,
చిత్రలేఖనముచే ♦ జెన్నారు సౌధంబు
లకు సాటియై గుహ ♦ బరగుచుండ,
బలు పసందుగఁ బుష్ప ♦ ములచే విరాజిల్లు
వనియై యరణ్యంబు ♦ పరలుచుండ,
గీ॥ నచ్చమంతయు నీచమై ♦ యొప్పుచుండఁ,
జింత నిల్వంగ, సంతస ♦ మంతరింపఁ,
గలఁడో ! లేఁడో ! దైవంబంచుఁ ♦ గలఁతగలుగ
సూరనాథుండు వచ్చెఁ గాం ♦ తార మేల ?

కట్టా! ఆ కన్నెమిన్న కీ పిన్నతనంబుననే, యెన్నరాని బన్నంబు లెన్నియో కల్గుచుండె.

రాజా—అయ్యా! వార లీ యరణ్యమునకే వచ్చిరా?

లక్ష్మ—అవును. ఈ యరణ్యమునకే వచ్చిరి.

రాజా—పాప మేదెసకుఁ బోయిరో!

లక్ష్మ—ఉత్తరదిశకుఁ బోయిరి. దైవానుగ్రహంబుచే, వారు భవద్దర్శనప్రాప్తిచే, సుఖము లందెదరని తలఁచెద. మీవంటి యాపద్బాంధవుల నెయ్యంబు గలిగినచో వారికింకఁ గొఱంత లేల యుండఁగలవు?

రాజా—కష్టముల పాలైనవారిని, భగవంతుఁ డెన్నటికైనఁ గరుణింపక పోఁడు. పూర్వ మెందఱెందఱు చక్రవర్తులుసైత మిడుమలు గుడువలేదె?

తే॥ గీ॥ మున్ను వనిఁ బెక్కునిడుమలఁ ♦ బొంది పిదప
ననుభవింపరె సౌఖ్యంబు ♦ లల్లధర్మ
జాదు లా ద్రౌపదినిగూడి ♦ యా హరికృపఁ
గష్టపడువారె ఫలములఁ ♦ గాంతు భువిని.

లక్ష్మ—ఆర్యా! మీరు వక్కాణించినది నిక్కువము, సప్తద్వీపముల నేకచ్ఛత్రమ్ముగఁ బరిపాలించిన హరిశ్చంద్ర సార్వభౌమునంతవాఁడు సపతీసుతుండై, యడవులఁ బెక్కుగష్టములందిఁ యనంతరమత్యంత సౌఖ్యంబులందఁడె!

రాజా—[స్వగతము] ఈతనింజూడ సర్వశాస్త్రజ్ఞుండగు నిజమైన దేశాభిమానివలెఁ గన్పట్టుచున్నాఁడు. ఈపరోపకార పరాయణుని గృపవలనఁగదా! నాయనుంగుజెలియొక్కయు, పితృసమానుండగు సూరనాథ ప్రభువుయొక్కయు, క్షేమవార్తలు వినఁగలిగితిని. తదుదంతంబు సాంతంబుగా నెఱుంగ, మత్స్వాంతంబత్యంత సంతాప సంతోషాక్రాంతమయ్యె. భగవదనుగ్రహ

మున వారినీ యడవిలో నెట్లయినఁ గలిసికొందును. [ప్రకాశముగా] అయ్యా ! కాలమెప్పుడొక రీతిగా నుండదు.

తే॥ గీ॥ కల్మిగలవాఁడొకప్డు భి ♦ క్షుకుఁడగును, నొ
కప్డు భిక్షుగాఁడే కల్మిఁ ♦ గ్రాలుచుండు
దైవమాయను దాటంగఁ ♦ దరమె ? మనకు !
నోడలే బండ్లగును బండ్లు ♦ నోడలగును.

లక్ష్మ - ఆర్యా ! తమరు సెలవిచ్చినట్లు విధివశంబెరు దాటఁగలరు? ఇక నాకనుజ్ఞ నీయవేఁడెద. మీ ఋణమీజన్మమందుఁ దీర్పలేను. సదా కృతజ్ఞతా మనోవందనంబు లాచరింపుచుండెద.

రాజా - పరాత్పరుఁడే మనకెల్లఱకు మేలు చేకూర్చుచుండును. పెద్ద తడవైనది. మీరికఁ బొందు.

లక్ష్మ - చిత్తము. ఆజ్ఞానువర్తినయ్యెద. [ అని నిష్క్రమించును.]

రాజా - ఈ బ్రాహ్మణోత్తముని యనుగ్రహముచేఁ గృతార్థురాలనైతిని. భళిరే ! ఈయన నన్ను నిజమగు యతీంద్రుగా భావించె. బహిర్వేషమా నీవెంతవంచకురాలవు. సత్పురుషులపట్లఁగూడ నింద్రజాలివైతివే ! [ యోజించి ] ఔను, కాకున్న నెట్లు ముందుకార్యము నెఱవేర్చుటకు సజ్జనులయెడ నైనను దుర్జనులయెడ నైనను కృత్రిమత్రిదండివేషముఁబూని యుండవలసినదే! నా ప్రాణసఖియగు తారాబాయికి సైతమీరహస్యం బెఱింగింపకుండవలయు. ఇప్పుడీభిల్లుల స్వాధీనపఱచుకొని, వీరిచేఁ గార్యమంతయుఁ గొనసాగింపవలయు. పాపము వీండ్రనాగరకులగుటచేతను, మాధ్యపిశాచావేశులగుటచేతను, ఇష్టదేవతను బలులచేఁ దృప్తిఁబఱచుచుండిరి. వీరినే యననేల! ఓక్కొకచోట నాగరకులుసైత మిట్టిదుష్కృతు లాచరించుటకద్దు.

తేగీ॥ జాలియనునది లేక య ♦ జ్ఞానులగుచు
బలులనిచ్చినఁదమ్ముఁగా ♦ పాడునంచు

నరయు నిరపాయకరములొ ♦ నట్టిపశులఁ
బట్టిచంపుదు రిదియేమి ♦ పాపమొక్కొ!

ఇంతకంటె మౌఢ్యము ప్రపంచమందెద్ది యైనంగలదా! రాను రాను నరబలికూడఁ బ్రబలుచున్నదే! మ్లేచ్ఛులిచ్చుబలులు చాలకకాఁబోలు! మనలోమనవారు సైతము బలులిచ్చుట. ఇప్పుడీప్రసక్తియేల? ప్రస్తుతాంశ విచారమొనర్పవలయు. ఈభిల్లులునన్నుఁజూచి పాఱిపోయిరి. అమాయకులగు వారిభయమునుబాపి, నీతులుపదేశించెద. వారికి సాధువులన్న గడుం గడుభక్తి. నామనోహరు సందర్శనభాగ్యంబున, పృథ్వీరాజానుగ్రహంబును, గూడ లభింపఁ బ్రయత్నముఁజేసెద. ఇటఁనే సమీపమందొక కుటీరము నిర్మించుకొని, ముందు నీ వనిం ద్రిమ్మరుచున్న సూరనాథమహీపాలుని, తారాబాయినిఁ దోడ్కొని తెచ్చుటకై, భిల్లవరుల వనిచెద. ఈ వనదేవతయే నాకన్నివిధముల శ్రేయము లొనఁగూర్చుఁగాక.

—* ద్విపద. *—

శ్రీ రామలింగేశ ♦ శ్రీ పార్వతీశ
ఘోర దైత్యవినాశ ♦ కువలయాధీశ
వృషభరాజతురంగ ♦ ధృతమరుద్గంగ
విషమబాణ విభంగ ♦ విమలాంతరంగ
అంబరాంబర పుర ♦ హార నాగహార
త్ర్యంబకేశ్వరగజ ♦ దనుజసంహార
భవ్యసచ్చారిత్ర ♦ ఫాలాగ్నినేత్ర
సవ్యసాచీచిత్త ♦ జలజాతమిత్ర
కవిజనస్తుతపాత్ర ♦ కాళీకళత్ర
దివిజోపవనచైత్ర ♦ దీనాళిమిత్ర

నా మనోనాథుని ♦ నాప్రాణసఖిని
మామహీనాథుని ♦ మన్కిఁజూపించి
మారాజు రాజ్యంబు ♦ మఱల నిప్పించి
కోరికల్ దీర్పంగఁ ♦ గొల్తు నిన్నెదను.

[అ ని ని ష్క్రమిం చు ను.]

ఇ ది,

ప్ర థ మాం క ము.

స మా ప్త ము.

శ్రీ

శ్రీ

కృష్ణపరబ్రహ్మణే నమః

# పృథ్వీరాజవిజయము.

## ద్వితీయాంకము.

[ప్రథమరంగము - అరణ్యము]

[తారాబాయి, సూరనాథుఁడు ప్రవేశము]

తారా—[ఆయాసముతో] తండ్రీ!

తే॥ గీ॥ కాళ్ళు బొబ్బలు పొక్కెను ♦ గఠిన శిలల
నడచుటను నింక నడుగైన ♦ నిడఁగజాలఁ
గొంతసేపైన నిచట ♦ విశ్రాంతినొంద
వలెను డస్సెను దేహంబు ♦ పలుకఁ జాల.

[అని మూర్ఛిల్లును.]

సూర—అక్కటా! నే నెంత వంతలగుందినను చింత లేదు కాని, నా ముద్దుపట్టినిఁ జూడ దుఃఖము నిలువకున్నది.

ఉ॥ పలువురు బాలికల్గలిసి ♦ పాడుచు నాడుచునుండ వారిలో
పల నొకరత్నముంబలెను ♦ భాసిలుచుండు ననుంగుపట్టి యీ
వడువునఁ దోడునీడయును ♦ బాసిచరించుచునుండె గుండియల్
నిలువున నీరుగానె! నలి ♦ నీదళనేత్రినిఁ బుత్త్రిఁజూచినన్.

సీ॥ పట్టెమంచముమీఁదఁ ♦ బఱుపుపైఁ బవళించు
బాలకా కటికతా ♦ నేలసెజ్జ!
పసిడియుయ్యెలలందుఁ ♦ బనికత్తెలూఁచు నా
బిడ్డ యాగతిలేక ♦ పడ్డదిచట!

అమృతాన్నమాఁగాక ♦ యవలఁద్రోఁచెడు రాచ
కూనకా పిడికెఁడు ♦ కూటికఱవు
జిలుఁగు బంగరువల్వ ♦ చే విరాజిలు నాకు
కోమిరెకా యీకావి ♦ కోకచూడ
గీ॥ దైవమా! యింక మామీఁద ♦ దయగలుగదె?
కాళికా! యెచ్చటన్నీవు ♦ కూలినావె?
నమ్మి ప్రజఁ గాఁచు నీకంక ♦ ణమ్ముఁగూడఁ
బెఱికివైచిరె తురకలు ♦ సరకుఁ గొనవు!!

తల్లీ! యీనేలపైనెట్టు నిదురపట్టె. ఆకలి రుచియు, నిద్ర సుఖమును, నెఱుఁగనీయదను నార్యోక్తికిదియే తార్కాణము.

చ. పసితనమందె నీజనని ♦ బాసి యిహాంతర మేఁగనెట్టటో
మసలుచునుండ నవ్విధిగ ♦ మత్తులు దుష్టతురుష్క వంశజుల్
వెస మనరాజ్యముఁ గెలిచి ♦ వీటిని వీడఁగఁజేసి రంతతోఁ
గసి మదిఁదీరకుంట మనఁ ♦ గానల కంపి రనుంగు పుత్త్రికా.

అక్కటా! భగవంతుఁడు దయామయుండయ్యు నేల యీ దీనులఁ గాపాడకుండెనో తోఁచకుండె.

మ. ధరణీదేవులు గోవధూప్రకరముల్ ♦ దైన్యంబు వీడంగ నా
దురితాత్ముల్ దితిజాళిక్రంగ నొగిము ♦ న్దోర్దర్పముఁ జూపఁడే
సరసీజాంబకుఁ డిప్పుడేలమన దు ♦ స్సంతాపముఁ బాపఁగా
మఱలఁ జన్మమునందఁడో! యవన దు ♦ ర్మార్గవ్రజంబార్పఁగన్.

ఎన్నిదినంబులిట్టి బన్నంబు లందవలయునో అంతవఱకుఁ దప్పునా! పుత్త్రికారత్నమా! ఇంతవఱకు మేలుకొనలేదు. నడకబడలికచే మూర్ఛితురాలైనది. ఇటకు సమీపమున నెద్దియైన కొలనుగలదేమో పరికించి యించుక సలిలంబుఁగొనివచ్చి, దప్పిఁదీర్చిన మేలగునని తోఁచుచున్నది.

[అనిపోయి జలముదెచ్చి కూఁతునకొసఁగును].

తార—తండ్రీ! ఇప్పుడు ప్రాణమించుక కుదుటఁబడినది. మనమింకను ప్రయాణము సేయవలయునా!

సూర—రక్కసులకన్నఁ బెక్కుఁజిక్కులను నేర్చిన యా మ్లేచ్ఛుఁడు లెక్కడవచ్చి నీకిక్కటులు గల్పింతునో యను భయముదప్ప వేఱొక్కటిలేదు.

తార-తండ్రీ! ఆతుచ్ఛులింత పెచ్చురేఁగి విచ్చలవిడిఁదిరుగుట కెచ్చటను రాజపుత్రవీరులులేరా! ఆర్యావర్తము వీరపుత్రవిహీన మయ్యెనా! వీరపుత్రికలైననులేరా! ఔరా! భరతఖండ మెంత యనాధస్థితికి వచ్చినది!

సూర-కుమారికా! శౌర్యమున కేమితక్కువ! విధియోగ లోపమే గాని,

తార-నాయనా! అదెట్లు?

సూర—మన రాజపుత్రులలోనే పరస్పర వైరములుమెండు. ఒకరి యౌన్నత్య మొకరికి గిట్టదు. ఒకరిమాట యొకరికిఁ బొసఁగదు. పూర్వమిట్లె కన్యాకుబ్జ నగరాధీశ్వరుండగు జయచంద్రుఁడు ఢిల్లీ సార్వభౌముండగు పృధ్వీరాజుపైఁ గినిసి, దగ్గఱనుండు గోముఖవ్యాఘ్రములగు, కొందఱి దేశద్రోహుల బోధనలకుఁ జెవియొగ్గి, లేనిపోని కలహములుపెంచి, తానొక్కఁడే యేమి యుఁజేయునదిలేక, కఱకు దురకలసహాయముఁగోరి, దేశము వారి పాలుఁజేసి. తుట్టతుదకుఁ దానుగూడ దుర్మరణమందెె.

తార—తండ్రీ! మీరు చెప్పినయుదంతము రాణీసంయుక్త తండ్రిది కాదా! ఆహా! ఆసాధ్వి పాతివ్రత్యమును, అసమానశౌర్యమును, ధనుర్విద్యా కౌశలమును, నేటివఱకుఁగూడ నెంచని వారులేరుకదా! తదనంతరమునుండియు మనకు పారతంత్ర్యము విడువకున్నది. ఛీ! ఐకమత్యము లేకున్న మనదేశమునకు స్వాతంత్ర్యము చేకూరునా!

ఉ॥ ఎంతటివైరమైనఁ బృథి ♦ వీశులలోఁ దమకుండుఁగాక తా
మెంతయుఁ జెల్మినేకమగు ♦ చేపఁగించుట యొప్పువైరులన్
మంతనహీనులై మిగుల ♦ మాంద్యులరై తమకన్నుఁదామె ని
శ్చింతగఁ బుల్లతోఁ బొడువఁ ♦ జేటొనగూడక యున్నె? చూడఁగన్,

సూర— కుమారీ! అట్టి యైకమత్యమే యున్నయెడల మనకీ వనవాస మేల యొనగూడును?

శా॥ రాజస్థానము నేలుచుండెడు మహా ♦ రాణాలసామంతులన్
నే జోహారు లొనర్చి వేఁడితిని యా ♦ నీచాత్ములన్ గూల్పఁగాఁ
దేజోహీనుల రౌచు స్వార్థసుఖమే ♦ దివ్యంబటంచెంచి రీ
రాజస్థానము స్నేహభావము జెడన్ ♦ రాజిల్లునా? పుత్త్రికా.

గీ॥ కటకటా! యేనృపాలుని ♦ కడకునేఁగి
సాయమడిగినఁ "దాదూర ♦ సందులేదు
మెడకు డోలాక్కటన్నకై ♦ వడినిమాకె
గలిగనక యుంటిమనిరి వె ♦ క్కసముదోఁప!

ఆదుర్మార్గులు, అర్ధనిశాసమయమునందు, మనసైన్యములు గాఢనిద్రావేశులై యుండ నొక్కుమ్మడిపైఁబడి చంపిరి. కాని, లేకున్న నంత కిబ్బడివైరి సేనలున్నను మనకుఁ బరాజయము గలుగకుండెడిది. ఇప్పుడేమనుకొన్న నేమిలాభము. ఇఁక నీయందే గంపెఁడాశ బెట్టుకొని ధనుర్విద్యానైపుణ్యము గలిగిన దానవగుటచే నుబ్బుచుంటి. నీఖరతరాసి పగతునిశిరంబు డొల్ల నేయ సమకట్టితి. అట్లు దైవమనుకూలింపఁడేని మనపగతు నేనృపాలశేఖరుఁడు గీటడఁగించునో యాతనినే నీమనోధవునిగాఁ జేయ నిశ్చయించితిని.

తార— జనకా! నాకట్టి వీరపురుషవరుని, వరునిగఁ జేయనెంచిన మీపుత్త్రికావాత్సల్య మత్యంత వర్ణనాతీతము. తండ్రీ! అదే మోకాని,

చ. తురకలనామముం దలఁప ♦ దుందుడుకెంతయొ చెందిశౌర్య వి
స్ఫురితయగుః మనం బొడలు ♦చోద్యముగాఁ బులకాంకురంబగుః
గరముననున్న కార్ముకము ♦ గంతులువైచిన దేమిచిత్రమో
పరమకృపాకరుండు భగ ♦ వంతుఁడు కన్నులువిప్పువెన్నఁడో!

సూర - అమ్మా! మనదినములు మంచివికాకుండుటచే మిన్నకుండ వలసివచ్చినది- కానిభగవంతుఁడు నన్నుఁబుత్రసంతాన హీనునిఁగను, సతీవియోగునిఁగను జేసినను, నీవంటిపుత్త్రికారత్నము నొసంగుటచే ననింద్యుఁడయ్యెను. నీవునాకన్నులయెదుట నున్నచో నాకెట్టియిక్కట్టులు గలుగుచున్నను, లెక్కగానుండదు.

తార--మీపుత్త్రికావాత్సల్య మట్లనిపించునుగాని, నేనేపాటిదానను. పూర్వపువీరమాతలొనర్చిన మహత్కార్యములం దలంచిన శరీరము పులకాంకురమగును. వారుమృతజీవులగుటచే వారిచరిత్రలు స్వర్ణాక్షరలిఖితంబులై, యిప్పటికిని సంస్మరణీయంబులగుచుండె.

సీ॥ సత్యభామాదేవి ♦ దైత్యాధినాథుతో
భీరుఁడై పోరంగఁ ♦ బోరలేదా?
దేశాభిమానంబు ♦ దీపింపఁదొల్లియా
సంయుక్తమ్లేచ్ఛులఁ ♦ జంపలేదా!
అలకరుణాదేవి ♦యవనసేనానియౌ
కుత్బుదీఁగోరీని ♦ గూల్పలేదా!
చీమబారులనేల ♦ బామిన ట్లరిచయం
బుల పద్మినీ మట్టెఁ ♦ గలపలేదా!
గీ॥ ఇంక నెందఱుకాంతలీ ♦ యిలను ఖలుల
రూపుమాపరు? నాథుల ♦ ప్రాపుఁగాంచి
కానఁ దురకలపేర్మాపి ♦ కన్నతల్లి
భరతమాత కృపన్నేను ♦ బడయునెంతు.

సూర—[సంతోషముతో] అమ్మా! నీవంతటిదానవే యగుదువు మానవునకుఁదగు సాధనలుండెనేని యెట్టిదుర్ఘటకార్యమునైనను, ప్రయత్నించి కొనసాగింప వచ్చుననుటకు సందియములేదు. [ఆయాసముతో] మేవాడప్రభువగు రాయమల్లుమహారాణా పొత్తుగల్గెనేని, యాతుచ్ఛుల పొగరడంప నెంతకావలయు? కుమారులుమువ్వురు కలహించి దేశాంతరగతులగుటచే, నారాణామనసు నిలుకడలేక చెదిరియుండె. అతని రెండవ కుమారుఁడగు పృథ్వీరాజు కడుచతురమతియు, ఆహవరాముఁడనియు, వింటి. అతఁడుగడుస్ఫుర ద్రూపియఁట.

తార—జనకా! రాయమల్లునిపుత్త్రుఁడేకదా! నాఁడుమీచేత తక్షశిలానగరమందతిక్రాంతమర్యాదుఁడై దునుమఁబడినది?

సూర—అవును. అతఁడు మిగుల గుటిలుఁడు. రాజ్యముకొఱకై సోదరులనేగాక, తండ్రినిఁగూడఁ దునుమ నెంచెనఁట.

తార—ఆహా! వాఁడెంతపాపి, దురాశాపరులకు దైవముతగినశాస్తిఁ జేయుచుండును.

సూర—వారిలో బృథ్వీరాజే కడుఁ బరాక్రమవంతుఁడు. ఈమధ్యఁ దనతండ్రి నెదిరించిన, గద్వారప్రభువును, నొకవర్తకుని సాయమువలనఁ గడతేర్చి యాకోటను స్వాధీనపఱచుకొనెనఁట.

తార—మీరాతనిఁ జంపితిరికదా! మీకును నారాజశేఖరునకును జెలిమి యెట్లుపొసంగును?

సూర—పుత్త్రీ! ఉత్తమక్షత్త్రియుల కెన్నటికిని, దురభిమానముండదు. దుర్మార్గుఁడయినచోఁ దండ్రియైనను, సోదరుఁడైనను, మఱియెట్టి దగ్గరచుట్టమైనను, వధింపఁబడుట కిచ్చగింతురు. అందుననే కదా! "మిత్రమా" మిగుల దుర్మార్గుండై, పాలవంటికులమునకుఁ గళంకముఁ దెచ్చుచున్న, క్షత్త్రియాన్వయాంభోధికి బడబానలము రీతిజనించిన, నాపుత్త్రుఁడగు జయమల్లుని వధించి, నాకుగీర్తిఁ దెచ్చితిరి. అనిమహారాణామనకు లేఖనంపె.

తార—ఆహా! ఆయన సౌజన్యమెంతయైనఁగాని శూద్రుఁడగు మీ రింతకుఁ బూర్వము గొనియాడిన రాకుమారుఁడిపుడెక్కడుండెనో!

సూర—[ఆయాసముతో] అతనినిగురించి యిప్పుడు మనకేమియుఁ దెలియుచుండలేదు; కాని అతఁడు బహుశః గద్వాలుకోటలోనే యుండునని తలఁచెద.

తార—జనకా! మీ రాయాసపడుచున్నట్లున్నది. [స్వగతము] ఇప్పుడీయన నావలెనే క్షుద్బాధా పీడితుఁడై యున్నాడు. నా తండ్రిని గష్టపెట్టుటకన్న నేనేయావనమునఁ దిమ్మరి, యేమైన ఫలములు దెచ్చియిచ్చిన మేలవును. (ప్రకాశముగ) నాయనా! సమీపమందెవ్వియైన ఫలములు దొరికినఁ దెత్తును మీరిటనే యుండుడు.

సూర—కుమారీ! నీవేఁగవలదు. ఇప్పుడు నాకేమియు నంతబాధగా నుండలేదు.

తార- నాకేమియు భీతిలేదు. సమీపంబుననే వెదకి దెత్తును. మీరు బాధగా లేదన్న సరియా! మీమోమే చెప్పక చెప్పుచున్నది.

సూర- అయినను నీవేగవలదు. నేనుబోయి తేఁగలను నాకుఁబ్రతి నుడువక నీవిటనే జాగరూకతతో నుండుము.

[అని నిష్క్రమించును]

తార- ఆహా! ఎండ కడుదీవ్రముగా నున్నది. వలదన్నను వినక జనకుండు ఫలములు గొని తెచ్చుటకై వెళ్లెను. (ఆకాశము జూచి)

మ॥ తన వంశోత్తములైన క్షత్రియుల బా ♦ ధల్వెట్టుచున్నట్టి దు
ర్జనసంఘుంబగు మ్లేచ్ఛమత్కుణములన్ ♦ మాడ్పంగ నూహించి తా
గినుకన్ బూనెననంగఁ దీక్ష్ణకరుఁ డ ♦ క్షీణప్రకాశంబునన్
మనుచుండెన్ గగనాంతరంబున నదే ♦ మధ్యాహ్నముల్ దెల్పుచున్

కట్టా! నాతండ్రి కెంతదురవస్థ ప్రాప్తించె. కనుసన్నలచే నూడిగము జేయించు ప్రభువు తనకుఁదా నొంటిగా నీ వడగాడ్పులో బిడ్డపొట్ట నింపుకొన వేఱుతెరువు లేక యీకాఱడవిని ఫలములకై పోయె, దైవమా! నీమాయ నెఱుంగ శక్యము కాదుకదా! తిమ్మిని బమ్మను, బమ్మను తిమ్మిని జేయుదువే? [అటు నిటు జూచి] ఇంకను జనకుఁ డరుదెంచుచుండలేదే?
(ఇంచుక యోజించి)

ఉ॥ ఏలికకూతునై మివుల ♦ నింపొనగూర్చెడు సౌధమందు దా
సీ లుపచారము ల్సలుపఁ ♦ జెన్నలరారుచునుండు నేను నీ
లీలను దిక్కుమాలి మృగి ♦ లీల వనిన్ మనుచుంటిఁ "జూడఁ జు
ట్టాలును ముక్కుదైవ మక ♦ టా! యిలలేనివిధం బిదేకదా!

తొల్లిటిసుఖము లీస్థితిలో జ్ఞప్తికిఁ దెచ్చుకొన్నఁ గడుపుబట్టదు. నా యవస్థలకంటెను వయోవృద్ధుఁడగు నా జనకుఁడు పడు శ్రమకంటెను, నా యనుంగుసఖియగు దుర్గాబాయిం దలంచుకొన్న కడుపు తఱుగుకొనిపోవును. ఆహా! ఆచెలి వాక్చాతుర్యము! స్మరణకు వచ్చిన నిప్పుడుసైతము నవ్వు రాకపోదు. నాసఖి వయోవిలాసము కండ్లకుగట్టినట్లే యున్నదికదా! ఆమెభర్తయగు మదనమోహనసింగు మమ్ములఁ దక్షశిలానగరమునకు దోడ్తెచ్చినపుడు, నిజసతీవియోగమున కెంతయో సంతాపపడియె. ఇప్పుడాయన యుదంతముగూడఁ దెలియరాదయ్యె. హా! ప్రాణసఖి! దుర్గా! నీవా కటికతురకల పాల్పడలేదుకదా! అయ్యో! నీ భర్తయొక్క వృత్తాంతము దెలియక యెంత గుందుచుంటివోకదా! ఒక్క గడియయైన నన్నుం జూడనిది యుండని, నీవిప్పు డెట్టుల గాలము గడుపుచుంటివి! నన్నొంటిగా విడిచియుండుట న్యాయమా! మన యాబాల్యవర్థిత స్నేహము నెట్లు మఱచినావు! [యోజించి] నాచెలి మనోధైర్యమును, వాఙ్నైపుణతయును, దలఁచుకొన్న నా దుండగుల పాలఁబడునని తోఁచదు. దైవానుగ్రహముచే నటుల బ్రదికి బట్టగట్టిన నా యుదంతము విచా

రింపకుండునా! మనోహరునకై భ్రమ్మరుచుండెనేమో! అయిన దౌ
ర్భాగ్యదేవతనగు నన్నిప్పు డాశ్రయించిన ఫలమేమి కద్దని, యుపేక్షిం
చెనేమో! ప్రపంచమున నట్టివారిప్పు డెందఱులేరు.

తే॥ గీ॥ ధనముగల్గినవేళల ♦ దరికిఁజేరి
ప్రాణహితులఁ దెఱఁగునఁ ♦ బఱగుచుంద్రు
నిండుసరసున మండూక ♦ నికరమట్లు
లేమితఱి నెంతురే నరు ♦ లేశమైన.

నాకుదగ్గఱి బంధువగుటయేగాక, ప్రాణాప్తురాలైన దుర్గాబాయికూడ నట్టివారిలోఁజేరునా! కాదు! కాదు! నా నెచ్చెలియట్టిదికాదు- ప్రాణసమానయగు నాచాన నన్నుఁగానక యిజ్జగానమనునే! తన ప్రాణేశ్వరుఁగలిసి, నాకొఱకై వెదకుచుండుఁ బోలు! దయామయుండగు నాభగవంతుఁడు నా నెచ్చెలి పునర్దర్శనము చిరకాలములోఁ గలుఁగఁజేయుఁగాత- [చెవియొగ్గి] ఏదియో అడుగులచప్పుడు వినవచ్చుచున్నది. మాజనకుఁడైయుండ నోపు- [అనిలేచియటునిటు చూచుచుండును]

[హఠాత్తుగా నల్వురుమ్లేచ్ఛులువచ్చి తీసికొనిపోదురు]

తార—ఓరోరీ! దొంగలారా! నన్ను విడువుఁడు, నన్ను విడువుఁడు! నిలిచిపోరాఁడుడు [అని కేకలువైచును]

[పృథ్వీరాజు ప్రవేశము]

తే॥ గీ॥ శరభ శార్దూల హర్యక్ష ♦ శల్యతతుల
నరయ భల్లూక హరి వరా ♦ హనికరములఁ
జంపితిమి వేలకొలఁదిని ♦ జాలునింక
వేఁట నీయాటవిని వేఁగ ♦ దాటవచ్చు.

సేనలింకను గడు దూరమున నున్నవి కదా! వానినిఁ గలిసికొన్నపిదపఁ బ్రయాణసన్నాహముఁ జేయవచ్చును. మిత్రరత్నమగు విజయసింగుకూడ వెనుక నుండెనే! (చెవి యొగ్గి విని)

ఏమది! కూఁత వేటుదవ్వున నేదియో యార్తధ్వని వినఁబడు చున్నది. ఎవ్వతెయో కాంత క్రూరమృగభీతినో! లేక నెవ్వరైన దుష్టులబారిఁ బడుటచేతనో! విలపించుచున్న ట్లున్నది. [మఱల విని] ఇచట కనతిదూరముననే వినఁబడుచున్నదే! అర్తయగు నామె నిప్పుడేపోయి రక్షించెదగాక.

(అని తత్తరమున)

మ॥ అరెరే! దుష్టతురుష్కసూకరములా ♦ రా! కాంత నొక్కర్తు ని
ష్కారణేన నల్వురుజేరి బల్మిఁగొనిపో ♦ గా నెంచనేలన విభా
స్వరమత్ఖడ్గకుమారికామణి మిముల్ ♦ సౌఖ్యంబులన్ దేల్చు సా
దరభావంబునఁ గౌఁగిలింతలిడి యి ♦ త్తర్విన్ వెసన్ జేరుఁడీ!!

(అని వేగిరపాటున నిష్క్రమించును.)

(యిద్దఱు మ్లేచ్ఛులు మృతులైయుండ నిద్దఱు మత్తులైన మ్లేచ్ఛుల ప్రవేశము)

1 వ—(మూర్ఛితునికడఁ జేరి) అరే! అల్లా! యద్యా యీడిపానంబి పోయి యుండాది. లేపిష్తాస్తామ్. మాకీ థోడా యిచ్చున్నాముగాంగ పిల్లల్ ఖద్సు సల్వ బచాయిచ్చునాం. అరే! యిస్మాయిల్! ఉఠోబే.

2 వ—[లేచిచూచి మఱల పడిపోవును]

1 వ—(లోపల) అరే! యీాఫిర్కియెద్యా! అది మల్లీ ఖొడ్తాడు అని దొంగవేషం సేస్తావుండాడు. (ప్రకాశముగా) అరే దీన్కి సచ్చాదులేరా, భయంలేదులేబే. (అని వీఁపుమీఁదఁ జరచును)

2 వ—లేదురాబాబూ! యిది బల్లక్కర్ అద్మి ఉండైగాదా.

1 వ—లేదు సూడ్ బే అంకి కైసా సూస్తావ్.

2 వ—(లేచి నిలుచుండి) దివానాముండాఖొడ్కు సూడ్రా! డొక్కానిచ్చాబి ఉప్పర్ బి ఖొడ్తావుండాయ్. ఇది ఆడ్దిగాదురా బాబు-నూటమదుసుల్ కి సంపిన మొగముండ గారా.

1 వ—దీన్కి పటో్కనియెత్తే బలే యినామ్ దొర్కుతాదిరా.

2 వ—నవాబుకీ మనమీంద నిండా అన్కుగ్రహం దొరక్తాయ్‌గా.

1 వ—(పరికించి చూచి) అరే! నీమాట షత్తెంరా! ఫాణం వుండాది.

2 వ—మల్లీ మేము యేంసెప్పాం అనుకున్యావ్.

1 వ- నీవు అచ్చాఁఅద్మి వుండావ్‌గారా. జావ్, తుమే పామ్ పకడ్‌రే మేము తలకాయి మోస్కుంటాం.

2 వ—అరే. ఛూ! నీయెల్లూరా ఖాల్లాకాడ్కి, నేతలయెత్కుంటాం.

1 వ—అరే నీమాటల్ నాఖాడా సెప్తావ్‌గారా- మేమ్ భచాయిచో్కని పడాగొట్టినాన్కవచ్చి, తఖ్లాయ యెత్తుఖుటాం అని నఖరాల్ సేస్తాబే ఫిర్కియెధ్యా. [అని తీసికొనిపోఁబోవు సమయమున]

[పృథ్వీరాజు ప్రవేశము]

పృథ్వీ—ఓరోరీ! ముష్కరతురుష్కులారా! మదోన్మత్తులై విజృంభించి ఒకయబలను బల్మినిగొనిపోవచ్చితిరా! మీమగతనము లీపాటివేనా! మిమ్ములనిప్పుడే యమాలయమునకంపెదఁ జూడుఁడు. [అని క్రొట్టుటతోడనే - అరేఅల్లామహమ్మద్ రసూలుల్లా అని కేకవేసి ప్రాణములు విడుతురు]

ఆహా! ఎచ్చటజూచినను నీముచ్చులే పెచ్చురేఁగి విచ్చలవిడి తిరుగుచున్నారు. ఈచెన్నటుల నిర్మూలముఁ జేసినఁగాని, హైందవస్త్రీలు తమపాతివ్రత్యమును నిల్పుకొనఁజాలరు. కట్టా! వీరిమూలముననేకదా! అతిబాల్యవివాహములును, స్త్రీవిద్యావినాశమును గలిగె, ఈమండగుల మూలమున, ఆడబుద్ధి తల బయటఁబెట్టుట యేప్రమాదముగానుండ, విద్యల నభ్యసించు నంతటి యవకాశము గూడఁగలుగునా! [తారాబాయిని

సమీపించి] పాపమీ కన్యకామణి యెవ్వరైయుండనోపు, ఈమె సోయగమెంత వర్ణనీయము.

సీ॥ అర్ధేందు పటలంబు ♦ హసియించు నిటలంబు
చిక్కువడ్డ కుసులఁ ♦ జెలఁగుచుండ !
భూధరంబులఁ ♦ బోల్పయోధరంబులునిక్కి
క్రొంగలై పయ్యెదఁ ♦ దొంగిచూడ !
అరుణపల్లవ రుచి ♦ నవఘళించు గరద్వ
యమ్ము గటికఱాల ♦ నలరుచుండ !
విద్యుల్లతికరీతి ♦ వెలుఁగొందు మెయిజిగి
చెంగావి చీరెలో ♦ రంగులీన

గీ॥ తలఁపమసిపాతఁ జుట్టుర ♦ త్నంబుకరణి
మబ్బులోనుండు నక్షత్ర ♦ మాడ్కినుండెఁ
గాన నీచానసాటి జ ♦ గానఁ గాన
నిట్లు వీరల పాల్బడ ♦ నేమిగతము ! !

అక్కటా! ఈమెయూర్చితురాలై నట్లున్నది. ఇట్టియవస్థలోఁ గూడ నీమె ముఖవికాసమెంత రామణీయకముగానున్నది.

చ॥ అమృతపుబావిగల్గి హరి ♦ ణాక్షులుగల్గి శుభాంకురాను జ
న్మమును గలింగి చెన్నలరు ♦ మానిని మోమును జూచిచూచియుఁ
గమలమనంగరాదు, కను ♦ కఁ గమలాసహజన్ముఁడన్న నా
సుమి ! రతికిందగుఁ దరుణి ♦ సుందరముఁ దగమానుతింపఁగఁ॥

ఏమీ! ఆకన్యాముఖమందము !

చ॥ సతివిలసన్ముఖంబుఁగని ♦ సారసమంచెలదేటు లెంతయో
కుతుకముతోడ వాలి యట ♦ కుందరినుండిన నాసచంపకా
కృతిఁగనులంబడఁ దిగులు ♦ నెక్కువఁబొందుచుఁ జేష్టలుడ్గియే
గతియునుదోఁపకవ్యాధినె ♦ కాంతకుఁ గన్మెమలొచుఁగాలెడిఁ

ఆహా! ఈకాంతారత్నమును దిలకించినది మొదలు నాచిత్తము పరాయత్తమగుచున్నది. పరనారీసోదరుఁడనగు నాకీమెపైమన సుపోనేల! [పరికించిచూచి] ఈమెకన్యవలెఁ దోఁచుచున్నది! మదనా! నీకిదియదనుగాదు. ఇంచుకతాళుము, డెందమా! తొందరపడి సందడింపకుము మూర్ఛితురాలగు నీచెలువకించుక సేదఁ దీర్చునిండు. పిదప విచారింతము. [అని శీతలోదకము దెచ్చి మీఁదఁ జల్లును]

తారా—(ఉలికిపడి లేచి) ఓరీ! మ్లేచ్ఛాధమా! పోయితివా? ఎందు దాఁగితివి? నిలు! నిలు!! (అని లేచును)

పృథ్వీ—బాలికామణీ! శాంతింపుము. ఆదుండగు లీపాటికి యము నండ నుండఁగలరు.

తారా—(స్వగతము) ఆహా! ఈమహనీయుఁ డెవరు? రుద్రఫాలాగ్నిచే దగ్ధుఁడుగాని మదనమోహనమూర్తివలె నుండెనే! ఈ పరాక్రమశాలియే యా తురుష్కుల నుక్కడగించి నన్నుం గాచిన పుణ్యశాలి యని తలంచెద. ఇప్పుడీ పురుషవరేణ్యున కేరీతి నా కృతజ్ఞతఁ దెల్పుకొందును. (అని ఆలోచించును)

పృథ్వీ—(స్వగతము) ఈమె యెవ్వతెయో రాజకన్యవలెఁ దోఁచుచున్నది. ఇట నేకాంతముగా గాంతారమందుండ గతమేమో కనుఁగొనియెద. ఈమాత్ర మడిగినఁ దప్పేమి?

(ప్రకాశముగా)

ఆ॥ గీ॥ ఓ విశాలనేత్రి! ♦ ఓ కృశోదరి! భోగ
భాగ్యములను వీడి ♦ బానిసవలెఁ
గన్నుగొప్పఁజేసి ♦ కడుపుఁ గొంచెముఁజేసి
కాననమున నిట్లు ♦ కనలనేల?

తారా—(సిగ్గుతో వెనుక కేగును)

పృథ్వీ—ఈపె సిగ్గుచే వెనుక కరుగుచు మాటాడకున్నది. మఱల నడిగిచూచెద.

ఉ॥ ఎవ్వరిదానవే సరసి ♦ జేక్షణ ! యెయ్యది? నీదునామ మి
ట్లివ్వని నేకతంబుగ వ ♦ సింపగఁ గారణమేమి తెల్పుమా ?
జవ్వనమున్ విలాసము వి ♦ షాదముచే నిటుగప్పి బాపురే !
పువ్వులుకాని దంతివలెఁ ♦ బోయెదవేల ? మొగంబుఁ ద్రిప్పుచున్.

తారా—(తనలో) వహ్వారే! ఈ పృథ్వీరాజు సోయగ మెంతరామణీయకము ! పృథ్వీరాజను జ్ఞాపకము వచ్చె. పృథ్వీరాజన మాజనకుఁడు చెప్పిన మేవాడ్మహీమండల సార్వభౌముం డగు రాయమల్లుని కుమారరత్నము గాదుకదా ! మాతండ్రి చెప్పిన చొప్పుఁ జూడ నప్పగిదినే తోఁచుచున్నది. (యోజించి) ఈయన సోదరునేకదా ! మాజనకుఁడు దునిమినది. నేను సూరనాథుం గొమిరెనని తెలిపినచో శత్రుకోటిలోనిదాన నగుదునేమో ! దుర్మార్గుఁ డగుటచేఁగదా ! వానిజనకుఁ డగు రాయమల్లు సార్వభౌముఁడు సైతము మాతండ్రిచేసిన కర్జమునకుఁ దన సంతసమును దెలుపుచు నుత్తరము నంపె. ఈ పురుషోత్తముఁడుమాత్ర మేఁకినిము. ఏమైనఁ గానిమ్ము. ముందుఁ బ్రత్యుత్తరమిచ్చెద. (ప్రకాశముగా) ధరాధినాథా!

ఉ॥ ధారుణిఁ గోలుపోయి కడు ♦ దైన్యముచే వనమందునుంటి మో
ధారుణినాథ ! వేదపుర ♦ ధాముఁడు నాపిత సూరనాథుఁడన్
బేరున నుండు, మజ్జనని ♦ పిన్నతనంబుననే గతించెఁ గాం
తారమునందుఁ గూడ రిపు ♦ దౌష్ట్యము దప్పకయుండె భూధరా!

నాతండ్రికిఁ బుత్త్రసంతానము లేదు. లేక లేక యభాగ్యదేవతనగు నే నుదయించితి. మాతృవియోగనగు నన్ను మాతండ్రి కడు గారాబమునఁ బెంచుచుండ నింతలోఁ " బులిమీఁదఁ బుట్ర " యనునట్లు తురుష్కులు రాజ్యాపహరణముఁ గావించి మమ్మిట్టు లరణ్యములపాలు జేయుటయేగాక యిటఁ గూడఁగడు నిడుమలు గుడుపుచుండిరి.

పృథ్వీ—ఆ తురుష్కనాయకుఁ డెవ్వడో !

తారా—మాళవదేశసుల్తానునకు, సామంతుఁడు మిత్రుఁడునఁట.

పృథ్వీ—మీకును వారికిని వైరకారణమేమి ?

తారా—దుర్మార్గులకుఁ గారణముండవలయునా? ఒక్కనాటిరేయి నిదురించు సమయమున హఠాత్తుగా మాసేనలపైఁబడి రూపు మాపినారు.

పృథ్వీ—కట్టా ! దుర్మార్గులెంత మోసంబు జేసిరి.

తారా—మా రాజ్యంబుపోయినను, మాకెంతవిపత్తుగలిగినను, చింత లేదు, గాని యీదుండగులు పుస్తకభాండాగారముల ధ్వంసము జేసి, ప్రశస్తదేవాలయంబుల రూపుమాపి, మానినీమణుల బల్మింజెఱఁబెట్టుట దలంచుకొన్నచో గుండెలు తల్లడిల్లును. యోధాగ్రేసరా ! మీయట్టి పరాక్రమశాలురుండియు, నీ తుచ్ఛులు పెచ్చురేఁగి విచ్చలవిడి మానవతులగు మచ్చకంటులఁ జెఱఁబట్టుట జూడఁగడుంగడు వింతగానున్నది. ఆర్యావర్తము లోని క్షత్రియులెల్లఱు గాజులు తొడిగించుకొనునప్పుడుగదా ! వారిదుండగములు సాఁగవలయు ! అంతదూరము పోనేల ? నేఁడు మీరే తెంచి నన్నుసంరక్షింపనిచో నాగతి యేమయి యుండును ?

పృథ్వీ—(తనలో) ఈకన్యకారత్నము చక్కదనముల కిక్కయగుటయే గాక, యుక్కుముక్కవలెఁ దోఁచుచున్నది. ఛీ! ఈమెనోడవి నటుల బరదేశీయులిటుల సాటివారల సిడుములబెట్టుచుండ నుపేక్షించుటకన్నఁ బౌరుషహీనమేమున్నది ? మూర్తీభవించిన శౌర్యరాశియగు నీలావణ్యరాశిఁ గాంతగాఁ జేకొను వాడెంతటి భాగ్యవంతుఁడు ! (ప్రకాశముగా) ఆతురకల దుండగము లడగించుటయన నెంత ! నీదయగలిగెనేని,

తారా—(స్వగతము) ఈమహాపురుషుఁడెంతటి కార్యమైన నెఱవేర్పఁ గలఁడు ! కాని నాదయఁ గావలెననుచున్నాఁ డేమి ? ఇందలి

యుద్ధమేమో! (యోజించి) ఆఁ తెలిసినది! నాపైనీయభినవ కుసుమశరున కనురాగముదయించి కన్యనఁపట యెఱింగి, పరిణయమాడ నుద్దేశించి కాఁబోలు! ఇప్పుడేమని ప్రత్యుత్తర మిత్తును? హృదయమా! చలింపకుము! నీవిపత్తులెల్లఁదీరు కాలమువచ్చినది. [ప్రకాశముగా] మహీశా! ముగ్ధనగునాకు మీపల్కుల యందలి యర్థమంతగాఁ దేటపడలేదు.

పృథ్వీ--బాలాలోక చూడామణీ! నీసోయగముంగాంచిన జడదారులైనను పెడదారులు ద్రొక్కుదురన నేవేఱుగవివరింపనేల!

తారా—[స్వగతము] ఈరాజపుంగవుఁడింకను, తనయుద్దేశ్యము గూఢముగానే తెలుపుచుండె. ఐననుమాతండ్రి మనోనిశ్చయమును, నా ప్రతినయునుగూడఁ దెలిపెద. ప్రతిన నెఱవేర్చినన్నుఁ జేపట్టినప్పుడుగదా! సంతసింపవలసినది. [ప్రకాశముగా] రాజశేఖరా! మమ్మిట్లు రాజభ్రష్టులఁ జేసి, దురంతదుస్సహసంతాప సంతప్తులఁగావించిన మ్లేచ్ఛనాయకుల శిరశ్ఛేదన మేభూపాలుఁడొనర్చునో! యాతఁడే నామనోధవుఁడు గాఁగలఁడని మా తండ్రియానతిచ్చెను. నేనందులకు సంతసముతో నంగీకరించి యట్లులే ప్రతినపట్టితి. ఇప్పుడుమాతండ్రి ఫలములకై వనికేఁగి వచ్చు వేళయైనది.

పృథ్వీ—రాజపుత్త్రీ! నీప్రతిన కెంతయు సంతోషాంతరంగుండనైతి. అచిరకాలములోనే నీయభీష్టమునీడేర్చెద.

తారా—ప్రాణదాతలగు మీకుఁ బ్రతికృతి నేమియుఁ జేయఁజాలనందులకు విచారించుచుంటిఁగాని, వైరిరాజగజకంఠీరవులగుదురను నమ్మకముచే నాశరీరము మీయధీనముఁ జేయనుంటి.

[తెరలో]

పృథ్వీరాజా! మేవాడ్మహీమండల యువరాజా! మధ్యాహ్నము మీఱపోవుచుండె, ఎచ్చటనుంటివి?

పృథ్వీ—(విని) ఆహా! కాల మతిక్రమించినది. మిత్రరత్నమగు విజయసింగు కంఠధ్వనివలె నున్నది. ఇంచుక దడసితినేని యాతఁడు సమీపించు, ఇతఁడుమిత్రుఁడైనను, ప్రస్తుతకార్యమున శత్రువుగాఁ దోచుచుండెను. మోహమా! నీవెంతదానవే! సృష్టినంతయు నూత్నవిధముగా బరిణమింపఁ జేయుటలోనిన్ను మించినవారు లేరుకదా! (ప్రకాశముగా) చెలీ! నీకన్నివిధముల భగవంతుఁడు భద్రముగలుగఁజేయుఁగాక. నేఁబోయివచ్చెద.

తారా—రాజచంద్రా! దయయుంచుఁడు. తలఁచినకార్యము దప్పక నెరవేర్చుట రాజపుత్త్రుల సహజభావమేకదా!

పృథ్వీ—[తనలో] అయ్యారే! ఈ చెలువమిన్నను, వీడిపోదమన్నను మనసొగ్గకున్నయది. పోకతప్పదు. [ప్రకాశముగా] మనోహరీ! నీపెట్టనిబంటై నా వెంటనంటి యాతుంట విలుకాఁడే సర్వకార్యములు జేయింపఁగలఁడు. [అని నిష్క్రమించును]

తారా—ఆహా! ఈ నవమోహనాకారు నీక్షించినప్పటినుండి నాడెంద మిదివఱ కెన్నఁడెఱుంగని క్రొత్తత్రోవలం ద్రొక్కుచున్నదే! ఆసుందరుఁడు దృష్టిపథంబునుండి దాటఁగనే మనంబున దిగులు వొడమచున్నది. అద్దిరా! ఆ వాకారపుటందగాని ముఖవిలాస మెంత వర్ణనీయము!

తే॥ గీ॥ మాటమాటాడ నమృతంపు ♦ దేటలొలుకు
వెన్నెలలుగాయు నవ్వున ♦ న్విన నొకింత
యారా! యశీతలేక్షుణు ♦ నాననంబు
దొగల దొరయని పొగడంగఁ ♦ దగదె? జగతి!

మఱల నారాజోత్తము దర్శనభాగ్యమెప్పుడు లభించునోకదా!

తే॥ గీ॥ ఆకువలయేశు దర్శన ♦ మబ్బునపుడు
గాదె? నయనోత్పలములు వి ♦ కాస మొందు

నా యినునిగర స్పర్శన ♦ మబ్బునపుడు
గాదె? చిత్తాంబుజంబు ప్ర ♦ కాశమొందు!

నీయభీష్ట మచిరకాలంబులో నీడేఱునను నమృతవాక్కుల చే విషాదరోషానలతప్తమగు మదంతరంగంబు జల్లారుటయేగాక తత్క్షేత్రమందు నూతనాభిలాషాంకురము లుద్భవించె.

ఉ॥ వచ్చియుకాని మీసముల ♦ వాఁడు, జగాజిగిఁగల్గువాఁడు వి
వ్వచ్చుని బోలువాఁడు పగ ♦ వారలనైనను గాఁచువాఁడు నా
యిచ్చలఁ దీర్చువాఁడు మది ♦ నెత్తుకపోయినవాఁడు వెండియుఁగా
వచ్చునె? వచ్చి నాకరముఁ ♦ బట్టునె? కట్టునె? వైరిసంఘముఁగా.

ఉ॥ చక్కనివారిలో మిగులఁ ♦ జక్కనివాఁడు, జగంబునందుఁ బే
రెక్కినవాఁడు నుక్కున మృగేంద్ర సమానుఁడుఁ జొక్కమైన మే
ల్పెక్కులవాఁడు లేఁడు గడుఁ ♦ జిన్నరిపొన్నరి వన్నెకాఁడు నా
యక్కఱఁ దీర్చువాఁడితఁడె♦యంచు నిజంబుగఁ దోఁచుచుండెడిఁగా.

[ఆలకించి] ఏదో యడుగులచప్పుడు వినంబడుచున్నది. మఱల నా రాజపుంగవుఁ డరుదెంచుచుండెనేమో! [అని చూచి] కాదు! కాదు! నాప్రియజనకుం డరుదెంచుచున్నాఁడు.

[సూరనాథుఁడు ప్రవేశము]

తారా—[ఎదురేఁగి] తండ్రీ! ఇంతయాలస్యముఁ జేసితిరేల!

సూర—తల్లీ! మనకు మంచిదినములు రానున్నట్టు దోఁచుచున్నవి.

తారా—అంతటిభాగ్యమా! ఎట్లు?

సూర—ఇట రాజనందయోగి యను నొక యతీశ్వరుఁడు కలఁడఁట. ఆయన యాశ్రమ మిచట కనతిదూరముననే కలఁదఁట.

తారా—ఎట్లెఱిఁగితిరి?

సూర— ఇద్దఱుభిల్లులు నాకు మార్గమునఁ గనఁబడి నన్నెంతయో యాదరించి, ఫలములనుగొనివచ్చి నాకొసఁగి యీశుభవార్తం దెలిపిరి.

తారా—భిల్లులు కడుదుర్మార్గులందురే! వారికింతటినీతి యెట్లబ్బినదో!

సూర—వారెప్పుడును దదాశ్రమమందేయుండి యామునిపుంగవుకడ సత్కథలువినుచు, గాలముగడుపుచుందురట

తారా—జనకా! మ్లేచ్ఛులనడగింప నాయతీంద్రునివలన మనకేమిస హాయముగలుగును?

సూర—అమ్మా! అట్లనఁబోకుము, పూర్వముధరణీపతులెందఱు సంయమీశ్వరుల యనుగ్రహముచే నెంతటిదుర్ఘటకార్యముల నెరవేర్చియుండిరో యెఱుఁగవా! అదియునుంగాక యాభిల్లుల మాటలఁబట్టిచూడఁగా నాతాపసిదేశాభిమాని యైనట్లూహించితిని-

తారా—[స్వగతము] ఇకనాశుభవార్తనుగూడ జనకున కెఱిఁగింప వలయుఁగదా! అన్నియుందెలిపెదఁగాని యానృపాలశేఖరుపైఁ గల యనురాగ మెట్లుదెలుపగలను? కానిమ్ము! క్రమముగా నన్నియు వెలిఁబుచ్చెద. (ప్రకాశముగా) జనకా! మీరట్లు ఫలములకై యేఁగినపిదప నల్వురుయవనులు జముబంట్లవలె వచ్చి నన్నుఁ బట్టికొని పోవనుద్యమించిరి.

సూర—[ఆతురతతో] అమ్మా! ఎప్పుడెప్పుడు! ఆదుండగులిప్పు డెచ్చట నుండిరి? (రోషముతో) ఒరే తుచ్ఛులారా! ఇంకను మాపైఁ బగసాధింపఁ దలఁచుచుండిరా? [కుమార్తెను జూచి] తరువాత నేమైనది?

తారా—నాకరములు బట్టుకొనినవారి నిరువురను విదళించి, నాకడ నుండిన యీ చిన్నికటారిచే నిరువుర నుక్కడంచితిని. మృతులైన యీయిద్దఱుగాక మఱియొకఁడు మూర్ఛితుఁడయ్యె.

సూర—ప్రాయశ్చిత్తము బాగుగా జరిగినది. తదనంతరము?

తారా—నాలవవాఁడు పోరాడి నన్ను మూర్ఛితురాలిం జేసె.

సూర - (విచారముతో) కట్టా! ఎంతవిపత్తుఁ గలి౯ . పిదప నే మైనది?

తారా—అనంతర మేమి జరిగినదో నే నెఱుంగనుగాని, కొంతవడికి నాపై శీతలోదకముఁ జల్లి శైత్యోపచారములు చేయుటఁ గాంబోలు! మేల్కాంటిని. నాప్రక్కను జూడగాఁ నొక పరాక్రమశాలి యగు రాజకుమారుఁ డుండె.

సూర—తక్కిన చెనటు లిరువురు నేమైరో!

తారా—వారిరువురుఁ గూడ మిత్రవాత్సల్యముచే మొదటివారిం జూడ నేగినట్లు కన్పట్టినది.

సూర—[ఆనందముతో] ఆ రాజకుమారుఁడే వారలఁ గడ తేర్చి నిన్ను రక్షించెనని యెంచెద.

తారా—సందియ మేమి? ఆ వసుంధరాతలపురందరుఁడే నన్ను గాపాడిన కందర్పసుందరుఁడు.

సూర—ఆపురుషుఁ డెవ్వఁడై యుండనోపు!

తారా—మీ రప్పుడప్పుడు నుడువు మేవాడ్ప్రభువు కుమారు సోయగంబును, తేజంబును నాతనియందుఁ గన్పట్టె.

సూర—ఓహో! ఆతఁడు పృథ్వీరాజు కాఁబోలు!

తారా—మఱచితిని. మీరు వక్కాణించినది, నిక్కవమే. ఆయన మిత్రుఁడు గాఁబోలు పృథ్వీరాజా! అని కేక వేయుఁగా తడవైనది, నాకొఱకట నెదురుజూచుచుండె నని నుడివి వెళ్ళిపోయెను.

సూర—శంక యేల! అతఁడే కావలయును. అమ్మా! మనమాముని న్యాశ్రమమున కేఁగుట శ్రేయస్కరము.

తారా—అట్లేపోదము.

సూర—అమ్మా! చూచితివా!

ఉ॥ గుంపులుగూడి పక్షులవి ♦ గో తమగూండ్లకుఁ బోవుచుండెనే
చెంపనుగాంచినన్ బ్రభలు ♦ చేవదొలంగుచెకాక, దిక్కులన్
గెంపువహించె, దీనిఁబరి ♦ కింపఁగ భానుఁడు గ్రుంకెనంచుఁదో
పింపుచునుండెఁగాన మన ♦ మెచ్చట కేని పుడేగఁగావలెన్॥

[అని నిష్క్రమింతురు[

ఇది,

ద్వితీయాంకము.

సమాప్తము.

శ్రీ

కృష్ణపరబ్రహ్మణేనమః

# పృ ధ్వీ రా జ వి జ య ము.

## తృ తీ యాం క ము.

రంగము-అరణ్యము—రాజానందయోగి

[ ప్రవేశము. ]

రాజా—ప్రభాతసమయ మగుచున్నది. పిట్టల కలకలరవంబులుసాఁగె.

సీ॥ కమలజాండపరీత ♦ గాఢాంధకార వా
యసనంతతుల్ వెస ♦ నడలిపోవ
గగనస్థలీచర ♦ త్కమనీయ తారకా
పారావతముల సం ♦ బరముఁబోవ
సకల సరోవర ♦ సంపుల్ల కైరవ
బకసంతతుల తల ♦ ల్లంగిపోవ
శశరక్షణాపేక్ష ♦ సరసీరుహారాతి
పడమటింటికిఁ జొరఁ ♦ బాఱిపోవ
గీ॥ అల చకోరప్రచయములు ♦ గలఁతఁబడఁగఁ
గుక్కుటంబులు భయముచేఁ ♦ గూఁతలిడఁగ
భానుఁ డాత్మకరశ్యేన ♦ పటలములను
జగతి విడిచెను బగలింక ♦ రగులకున్న ?

ఆహా! కాలమను శిల్పికారి లోకమంతయు బంగారుపూఁత
బూసిన ట్లెంత రమణీయముగ నుండె.

గీ॥ అరిధరాధిప దర్పనీ ♦ హారపటలి
తఱుగ నల పృధ్వీరాజు ప్ర ♦ తాపరుచులు

పర్వోనోయన నీరెండ ♦ పఱుగుచుండెఁ
బద్మినీచయమెల్ల సం ♦ బరముబడఁగ.

గడచిన రేయియుండే రావలసిన చారులింక నిప్పటికి రాకుండి రేల ? మార్గమున శత్రువులబారి పడిరో ! లేక యాపృథ్వీ రాజు దర్శనమబ్బియుండలేదో ! తెలియకుండె. అదియును గాక, కంటక శిలా వృతంబులగు నీయడవి దారుల నడచుట కడుంగడు శ్రమగలిగించు, భగవదనుగ్రహంబునఁ బోయినపని పండెనుచో నీపూట దప్పకవత్తురని తలఁచెద ఇంతలోనిత్య కృత్యంబులు దీర్చుకొందుగాక.

[ అని నిష్క్రమించును ]

[ చా రు ల ప్ర వే శ ము ]

[ కేతిగాఁడు, ఎల్లిగాఁడు, అప్పిగాఁడు, అంకిగాఁడు ]

కేతి—(అటునిటుజూచి) అంకిగా ! దొరోరేడకో పోయింద్రాయేరా!

అంకి—ఏడకి పోలేదొచ ఆచెరువుగట్టుమీాన జూడరపిచ్చోడ,

ఎల్లి—ఒరేఅబ్బాయ, మనం రాత్రిరావలచిందిగంద, ఉప్పుడొచ్చామని కూకలేత్తాడేమోరా.

అప్పి—బయము లేదు లేవుసె,

కేతి—మంచిదొర్రా, అరండేలలో యావన్న యిబ్బంది లొచ్చిని య్యాని చెప్పకుండాంరా.

అంకి—నిజమేనొసె, అట్టాచెప్తే పెబువోరూరుకుంటారు.

కేతి- అంకిగా, నువ్వును, ఎల్లిగాడూను ఎల్లొచ్చినపని చార్లయిందా! మల్లిదిగ మెట్టుకొచ్చారా !

ఎల్లి- మామా నీయల్లుడెల్లిగాడెల్లటం మల్లదిగమెట్టుకోనిరావటంనా! ఏంటి - శాయశిత్తులఁ నిగ్గించుకొత్తాడుగాని,

అప్పి- అవునురా ! నువ్వుబేసయినోడువు - దున్నపోతే దూడల్లోను మెయ్యబోతే యెడ్డల్లోను గాదంటా !

ఎల్లి- ఏరో నోటికితిన్నగా తెచ్చుకో, మిగలకూతలు కూత్తుండావే ! ఎందుకవతల పెద్దోడుమామున్డాడు.

అప్పి- ఏంలేకపోతే యేందో సీమకన్నంగీ నానూనుకోవాలాయేంరో !

ఎల్లి- ఆఁ అట్టాగే వాగుతావుండూ మెళ్లకుర్కి- తన్నానంటె కాళ్లిరగాల్చిందే ! [అని తన్నబోగా కేతిగాడుపట్టుకొనును.]

అప్పి- రానీరానీయరా ! మూ మొనగాడంటా అవనపని అవనేలయింది యిరగదీసి చెర్లో పెడ్తాను.

అంకి- అన్నీ మెడ్తాల్లేరా ! చన్నాచుల్లాలా ! ఊరుకొండనే, అవతల దొరోరుగానా సూసేరు. కేతయ్యన్నా నీవు మోయినపని కాయూ పండా !

అప్పి- పండుగాకేముండదిరా! మన బేపనదొర దీవనెట్టి పంపినాడాంటె యింకా తిరుగుండది ?

కేతి- అబ్బాయా ! మేమెల్లినకాడుంద్రై పేటలు కోటలును ఏమిచ్చింత రాలనిచెప్పను ? ఆపట్టంలో పెజనచ్చోప నచ్చలుకాదంట్రా !

అప్పి- ఎక్కడనచ్చోప నచ్చలా ! ఎయిలే, పెద్దబజారున మోత వుంటే కిటకిట లాడ్తావుంటదిరా ! ఏవన్నా చందుండదను కున్నావాయేంటి.

కేతి- అబ్బాయా ! అపట్టంలో బిసదీపాలుంద్రై, మాపిటాలకూడా పట్టపగులేరా.

ఎల్లి- అంత తమానాలుండాయయేంరా !

అంకి- నేనుకూడా పట్టం సూసిరావాలిరా !

అప్పి- సూట్టం గీట్టం నాకు తెలవదు. లోట్లుమీాన సెట్కాఁరీబల్లెప్పుడు చందులేకుండా వుంటయి. లోట్మీదగినా కాల్మడుసుకున్నావా! లేసినోడు లగాయించాడన్నమాటే.

అంకి- లేసినోడ్రోడా !

కేతి- లేసినోడంటే తెలవదంట్రా ? బంటోతియ్యగాదంట్రా !

అప్పి- మేమెల్లొచ్చిన పెబువు యీడకొత్తారియ్యాల

కేతి- మాకియ్యాల యీాతనీల్లు కరువు లేదన్నమాటే
ఎల్లి- మామోయ్ నేనుండ,
అంకి- కేతయ్యన్నో నామాట మర్సిబోమోకరో
అప్పి- ఈళ్ళంతా కట్టబడేతప్పుడు రారుగాని, యిప్పుడొత్తారయ్యా మడిచిమీాద మడసి
ఎల్లి- ఈడిచొమ్మోం బడిపోయిందో
కేతీ- యేడ్సారు పదంౘ్రడా! యెప్పుడు యిరోదాలేను. సెరువుకాడికెల్లి వుత్తరాలిద్దాం మనమెల్లి మల్లీ గొక్కున సద్దినీల్లాగాలి నడవండొసే.
అప్పి- అక్కడగ్గానాయొత్తే యేవన్న అంటారేమొసే
కేతి- ఏమనరు పదంౘ్రడా! మనకిచ్చినియ్యి మిరబగాయి టపాలు.

[ నిష్క్రమింతురు. ]

మునికుటీరము:

[ రాజానందయోగి ప్రవేశము ]

రాజా- [స్వగతము] ఆహా! ఈ యరణ్యంబే శరణ్యంబుగా నెంచిన నాకిది యెంత శ్రేయోదాయకంబయ్యె. నామనోహరుని, మదనమోహనుని, నాయభినవ కుసుమశరుని కన్నులజూపి పున్నెము గట్టుకొనియె. నేఁజేయు నుద్యమమునకు నానాథుఁడెంతయో సంతసించుటయే గాక తానైత మీావనియందే భిల్లులసైన్యము సమకూర్చి వారలను ధనుర్విద్యా వ్యాపారము గఱపుచుంటిననియు, మన రాజుకొఱకు మన రాష్ట్రముకొఱకును, అవసరమైనచో ప్రాణమునైన సమర్పింపవలయునని చెప్పె. ఆహా! స్వామిభక్తియన్న నిట్టులుండవలయుఁగదా! కొందఱు ప్రగల్భులు దేశాభిమానమని చెప్పుకొని, పెద్ద పెద్ద యుపన్యాసము లిచ్చుచుఁ గార్యావసరమునఁదు మోమైనం జూపరు. అట్టి వాక్చూరుల ప్రసక్తి నాకేల? [యోజించి] ఇఁక నీయువన దవానలము జల్లార్పఘనుండగు నాపృధ్వీరాజ శరవృష్టిమాత్ర మపేక్షణీయము.

నేఁడా రాకుమార చూడామణి సందర్శనభాగ్య ప్రాప్తము గలుగుననుటకు సందియములేదు. నాపంపినచారులు మాటలతోఁ జెప్పుటయే గాక, పృథ్వీరాజ స్వహస్త లిఖితమగు నొకపత్రికనైతమిచ్చిరికదా! నేఁడే తప్పక వచ్చును. ఆహా! ఈకాంతారలక్ష్మి నెంతయుని కొని యాడుదు. నాకృతజ్ఞతాపూర్వకమగు వందనము లర్పింతుగాక.

సీ॥ అనుఁగు నెచ్చెలిఁజూపి ♦ యతిముదంబిడిన కాం
తారలక్ష్మి! నమ ♦ స్కారమమ్మ!
నానాథుఁజూపి నా ♦ కానందమిడిన కాం
తారలక్ష్మి! నమ ♦ స్కారమమ్మ!
సూరనాథునిఁజూపి ♦ శుభములఁగూర్చు కాం
తారలక్ష్మి! నమ ♦ స్కారమమ్మ!
అరిబాధలేకన ♦ న్గరుణతోఁగాంచు గాం
తారలక్ష్మి! నమ ♦ స్కారమమ్మ!
గీ॥ పృథ్వీరాజును జూపిసం ♦ ప్రీతితోడ
నరులఁ గెల్వఁగ జేయుమో ♦ యమ్మ! కృపను
సోదరీ సోదరుల వేరు ♦ జూడకమ్మ!
వనమహాలక్ష్మి! నీకివే ♦ వందనములు!!

[అని ముక్కుమూసికొని జపము జేయును]

[పృథ్వీరాజ, విజయసింగుల ప్రవేశము]

పృథ్వీ—వహ్వారె! మిత్రమా! యతిపుంగవున్ దిలకింపుము. సనకసనందాదులలో నెవ్వారైనమనలఁ బావనులఁజేయ దివినుండి, భువికేతెంచినట్లుండె, తపోనిధియగుటచేఁగాఁబోలు! శాంతరసము పొంగుచుండె.

విజ—రాజకుమారా! ఇతఁడు నిశ్చయముగా శుకయోగీంద్రుండని, తలఁచెద.

పృథ్వీ—ఆకరంబుల సౌకుమార్యమును, నాలేఁత మొగంబందంబును,

కాషాయ వస్త్రధారుఁడై ముక్కుమూసికొని జపంబుఁ జేయు
టయు జూడ నాలో నాకే యాశ్చర్యమొదవుచున్నది.

చ॥ కరముస్పృశించుమాత్రమునఁ ♦ గందుఁ దనూవిభవంబు నిండుచం
దురు జిగిఁగల్గి చెప్పలరు ♦ తోరముజిల్కెడి నెమ్మొగంబు నా
పరమతపోగరిష్ఠతయు ♦ బాలమునీంద్రుఁ డటంచుఁ జెప్ప కే
యెఱుకయొనర్చెడిన్ బళిర ! ♦ యాతనిచిత్త మెంతగట్టిదో !!

జిజ—యౌవన వయస్కుఁడగు నీతఁడు హృదయము నెంత పదిలము
గా నుంచెనో యరసితివా !

పృథ్వీ—కాముఁ డిట్టివారి జయింపలేఁడు కాఁబోలు !

జిజ—పృథ్వీరాజా! చిత్తభరిత శ్రీకంఠులగునట్టి యతిపుంగవులకడఁ
గూడ నంగజుని యాటలు సాఁగుననుకొంటివా !

పృథ్వీ— చెలికాఁడా ! నిక్కము వక్కాణించితివి ఇఁక సమీపిం
తము రమ్ము.

[ ఇరువురు ] మునీంద్రా! నమస్కారములు.

రాజా—[ కన్నులు విప్పిచూచి ] క్షాత్రతేజముట్టిపడుచున్న ఈతఁడే.
పృథ్వీరాజని తలఁచెద. చారులుచెప్పిన యానవాలున కావం
తయు లోపములేదు. ఈ రెండవశూరుఁడాతని యాప్తుఁడగు
నేమొ! [ప్రకాశముగా] ఇష్టావాప్తిరస్తు. ఓ వీర పుంగవులారా!
ఇటు కూర్చుండుఁడు. [ అని పృథ్వీరాజుఁజూచి ]

తే॥ గీ॥ ఆర్తజనులనుగాంచిన ♦ నభయమిచ్చి
భూమి తలక్రిందులయినను ♦ బ్రోచునట్టి
యభినవార్జునుఁడని జను ♦ లాడుకొనఁగ
నలరు పృథ్వీపతివికావె! ♦ యనఘ ! నీవు!

పృథ్వీ—చిత్తము. [తనలో] ఆహా! ఈమహానుభావునకు నేను పృథ్వీ
రాజుననుసంగతి యెట్లుతెలిసె.

తే॥ గీ॥ వార్తఁబంపుట నేఁడు నే ♦ వత్తునంచుఁ
దెలిసియో! లేక వేఱొక ♦ తెఱఁగొ! కాని,
ముక్కు మొగము నెఱుంగఁడు ♦ నిక్కువముగ
నో! మునీంద్రుల మహిమల ♦ నరయఁదరమె?

నేఁడీ యరణ్యంబులో నాహృదయాంబుజాత మపహరించిన, మరాళగామిని నా సొమ్మగునేమో! ఈమ్మునివరు నడిగినఁ దక్క నిక్కము వక్కాణింపఁగలఁడని తలంచెద- [యించుక యోజించి] యతీశ్వరులకడ నీప్రసంగముఁ దెచ్చినఁ గినియుదు రేమొ! [తలయూఁపి] కానిమ్ము. గూఢముగానడిగెద. గూఢముగా నడిగినమాత్రమున, పరమనోభిప్రాయజ్ఞులును, దివ్యజ్ఞాన సంపన్నులును నగు వారికిఁ దెల్లముగాకుండునా! మునులు దీర్ఘకోపులుగారు, కదా! తరువాత క్షమాపణఁ గోరవచ్చును. ఏమైననుసరే! ముందడిగి తెలిసికొనక యుండఁజాలను. [ప్రకాశముగా] మహాత్మా! నామనంబున నొకకోరికకల దదినెఱవేఱునా!

రాజా—[తనలో] ఈ రాకుమారుని ముఖచిహ్నములును, ఆతురతయుఁజూడ మాతారాబాయిం గూర్చిన విషయమేయని తలఁచెద. ఆమెవలన నీయుదంతమంతయు నీవఱకే సొంతముగా నెఱింగి యుంటిఁగదా! [ప్రకాశముగా] రాకుమారా! నీయుదంత మెల్ల నా యంతరంగమునకు గోచరమయ్యె. చెప్పెద నాకర్ణింపుము.

ఉ॥ కన్నెయొకర్తు మూర్ఛపడి ♦ కానఁగనంబడఁగాచి యుంటివా
యన్నులమిన్న నీమనము ♦ నన్నుల మిన్నమనంబు నీవుఁజే
కొన్నది -యాదిగామరుని ♦ కోలలకోడి భరింపలేక నీ
వున్నది వాస్తవంబగునె? ♦ ఊఁ యనుమాపయిఁదెల్పుదంతయుఁ.

పృథ్వీ—[సంతోషముతో] ఆర్యా! తాముచించిన దంతయు నిక్కనమే. ప్రస్తుతమా హస్తిగమన యెటనుండెనో!

రాజా—[తనలో] నేననుకొనినట్లే యయినది. [ప్రకాశముగా] ఓ. యోధాగ్రేసరా! ఆసుందరరదన ప్రతిదిన మిట కేతెంచి, అయిందుశేఖరు సుందరిని డెందమునఁగొల్చి పోవుచుండును.

పృథ్వీ—[సంతోషముతోఁదనలో] ఆహా! ఏమి నాభాగ్యము! చాలా వణ్యారాశిం గన్నులఁజూచు పున్నెము మఱలఁ గలుగనుండె. హృదయమా! ఇఁకఁగుదుటఁ బడుము. ఇఁక నీయతివరుండెందులకు నన్నుఁ బిలువనంపెనో యడిగి తెలిసికొనియెద. [ప్రకాశముగా] స్వామీ! నేఁడు భవత్సందర్శనంబునఁ బావనుల మైతిమి. ఈదాసుఁడేమైనఁ జేయవలసి యుండెనేమో! తెలుప వేఁడుచున్నాఁడు.

రాజ—రాకుమారా నీచేఁ గావలసిన కార్యములు పెక్కుగలవు.

పృథ్వీ—తమ యాజ్ఞలను శక్తివంచనలేక పాటుఁబడి నెఱవేర్పనున్నాఁడను.

విజ—యతీశ్వరా! తమయానతులమాళి నిడుకొని చేయుట కేగదా! యిట్లరుదెంచినారము.

రాజా—మీభక్తివినయంబుల కెంతయో సంతసించితిమి. [పృథ్వీరాజుతో] చేయవలసిన కార్యములన్నియుఁ దెల్పెద. కాని, నీవు ప్రస్తుత మొక కృత్రిమ తాపసివై నటింపవలయు. నీప్రాణసఖి యిటకు రాఁగలదు. ఈరూపముననుంటివేని లజ్జచే రా శంకించును. ఈ నీయాప్తునిఁగూడఁ గొండొక కార్యముపై ననుపుము.

పృథ్వీ—స్వామీ! మీయాజ్ఞానువర్తినయ్యెద. [అని విజయసింగుచెవిలో నేదియోచెప్పి యవలకుఁ బంపును. ]

రాజా—బాలకా! నీవిఁక యతివేషము దాల్పుము. [అని వస్త్రములిచ్చును.]

పృథ్వీ—[శంకించు చుండును.]

రాజా— రాకుమారా!

తే॥ గీ॥ అతివలనురోసి సన్న్యాసి ♦ యగుటకద్దు
అతివలకొఱకు సన్న్యాసి ♦ యగుటనెందుఁ
గానననియు! సంశయమాత్మఁ ♦ బూనుచుంటి
నర్జునుచరిత్రమెఱుఁగవో! ♦ యవనినాథ!

పృథ్వీ—తామానతిచ్చినదానికింక సంశయమేల? [అని యోగివేషముఁ దాల్చి కూర్చుండును.]

సూరనాథుఁడు సుతసహితముగాఁ కాళికాలయమునకుఁ బోవుచుందురు.

పృథ్వీ—ఆర్యా! ఆవృద్ధ రాజపుంగవుఁ డెవ్వరో!

రాజా—

ఉ॥ పేరుఁబ్రకాస్తియుంగలిగి ♦ పెద్దలలోఁ గడుఁబెద్దయైన నా
వీరుఁడు సూరనాథుఁడను ♦ పేరునధారుణి నేలువాఁడు కాం
తారమె దిక్కుఁ జేసికొని ♦ తద్దయువంతలఁ గుందుచుండె నా
ధారములేక మ్లేచ్ఛుల మ ♦ దంబడఁగింపఁగ రాజచంద్రమా!

పృథ్వీ—స్వామీ! ఆ వెనుకఁబోవు కన్యకారత్న మీయన యనుఁగుపట్టి యేకాఁబోలు!

రాజా—అవును. ఆమెయే నీ మనోహారియగు తారాబాయి యని యెఱిఁగియే యుందువుగదా!

పృథ్వీ—[నవ్వుచు] చిత్తము. [తనలో] ఆహా! ఇప్పుడాపె కృతావగాహయై కాళికాలయములోనికిఁ బోవుచున్నట్లున్నది. వహ్వారే! ఆయరవిందాస్య కురులయందము.

మ॥ అరయన్ గాంత ముఖాంబుజంబుఁగని యా♦ హ్లాదంబునం జేరు బం
భరసందోహమొ! చంద్రనిర్మలితా ♦ జ్ఞాతంబుగాఁ గ్రాలుటన్
శరణంబంచును జేరినట్టి యిరులో ♦ చక్ర స్తనీ కేశముల్
తరమా! నాకునుతింప వానిసొబగున్ ♦ దర్శింప నింకేటికిన్॥

(ప్రకాశముగా) ఆర్యా! ఆ బలభిన్నీలవినీలాలకజాల, తమ కడకు రాలేదేమి? స్నానవాలుపట్టెనా?

రాజా—బాలకా! తొందరపడకుము. ఆ మచ్చకంటి పచ్చవిల్తుశరములం గొని యిచ్చుటకు రాఁగలదు. తజ్జనకుఁడు కాళీపూజ సల్పుచు నటనే యుండు.

పృథ్వీ—మహాత్మా! కన్నులవింటిజోదు తన తలిరాకుబాకుల ఢాకలు సోఁకఁజేయుట గాక యాపూఁబోఁడికిఁ గూడ శరములిచ్చి నన్నేచ నెంచెను గాఁబోలు!

రాజా—(తనలో) ఇతఁడు మిగుల మోహావేశుఁడై యున్నాఁడు, నా చెలిపై నితనిమనసు గట్టిగాఁ దగులుటచే నాయుద్యోగము దప్పక నెఱవేరునని తోఁచుచున్నది. (ప్రకాశముగా) రాకుమారా! ఇంతలో నీకింత పిచ్చియేల? అదిగో! చెలువయే తెంచుచున్నది. ముక్కు మూసికొనుము,

(తారాబాయి ప్రవేశము)

తారా—అహా! ఈ క్రొత్తముని యెవ్వరో! మునుమూర్తుల వీరిద్దఱు నర నారాయణులవలె నున్నారు. (కొంచెము తేరి చూచి) ఈ నూత్నమునిపుంగవుని కిది నవీనాశ్రమముపోలెఁ దోఁచుచున్నదే!

సీ॥ తొగలరాయుని గేరు ♦ నగు మొగంబున భస్మ
మది యొకరీతిగా ♦ నలరుచుండ
మగఱాల నిగనిగల్ ♦ మలయు నాగళమందు
రుద్రాక్షమాలిక ♦ రుచినిఁజూప
ఆర్తులఁగన నభ ♦ యమ్మిచ్చు గైదమ్మి
జపమాల యొకతీరు ♦ చవుల నీన
బంగారు జలతారు ♦ వలువఁ దాల్చెడుమేన
నీర్కావిబట్టొక ♦ నీటుఁజూప

గీ॥ అల్లనాఁడా సుభద్రకై ♦ యడుగుడెంచు
దొంగయతివోలె నీ ముని ♦ పుంగవుండు
కానుపించును, నానేమొ! ♦ కనుఁగొనంగ
వశమె? యెప్పట్టులో నేమి ♦ పాముగలదొ!

(అని సమీపించి నమస్కరించును.)

(ఇరువురు) అభీష్టసిద్ధిరస్తు-

తార—(పుష్పముల నందివ్వఁబోవును)

రాజా—కన్యకా! ఈ సుమంబుల నామునిరాజున కర్పింపుము-

తార—(జిచ్చవడి నిలుచుండును)

పృథ్వీ—

ఉ॥ ముక్కిఁడులైన రక్కసులఁ ♦ బోలిన మ్లేచ్ఛులతోడఁబోరి తా
నక్కట! మూర్ఛనుండునపు ♦ డంబువులన్ గొనితెచ్చి మత్పురో
బక్కనుజేరి చల్లుతటి ♦ బాసలనాడెను వేళఁ గాన వీ
శక్కినిఁ బుట్టనేల? యిట ♦ భామినికినును సిగ్గుదొంతరల్.

(తారాబాయి వెంటనే లోనికిం జనును)

రాజా—బాలకా! నీవిపుడు నిజముగా బాల్యచాపల్యముఁ జూపి
తివి సుమా!

పృథ్వీ—స్వామీ! క్షమింపుడు, ఇప్పుడాపె యలిగినదాయేమి!

రాజా—రాకుమారా! కలఁతవడకుము.

ఉ॥ చిత్తమునందు సందియముఁ ♦ జెందఁగనేల నరేంద్రచంద్రమా!
మత్తమరాళయాన మన ♦ మాటనుదాటుటకల్ల! బాలనీ
పొత్తుగనెంచు కొమ్మురిపు ♦ శూన్యముజేయుము మ్లేచ్ఛనాయకా
మత్తగజేంద్రసింహా! తర ♦ మా పెఱవారికిఁ దారఁజేరఁగన్.

పృథ్వీ—యతీశ్వరా! శతృసంహారోద్యోగము నిదివఱకే వహించితిని
ఇంక నెద్దియేని కలదేని.

ఉ॥ దేవరయాన మాళినిడి ♦ తీర్చెద నెంతటికార్యమైనఁ గా
నీ! వివరింపు డిప్పుడ త్ర ♦ ణీకృతమా నది నాకు, మీరలే
దీవనలిచ్చి పంపఁ, గల ♦ దే? భువిమానవుఁ డెంచిచూడఁగ
భావమునం దసాధ్యమును ♦ భావభృతాంబుజబాణహంతకా!

రాజా—ఏమని చెప్పుదును?

సీ॥ ఏచక్కిఁ గనుఁగొన్న ♦ నీ మ్లేచ్ఛరాక్షసుల్
పాడుపాడుగఁ జేయు ♦ మేడగములె
లేవంకఁ దిలకింప ♦ నీ దుండగీడులు
పెల్లగించిన గొప్ప ♦ గుళ్ళదిమ్మె
ఏవైపుఁ జూచిన ♦ నీ తుంటరులు బట్ట
గొల్లున గోలెత్తు ♦ కొమ్మగుములె
ఏతట్టుఁ గాంచిన ♦ నీ చెన్నటులు మోదఁ
గుయ్యో మొఱ్ఱో యను ♦ నయ్యవార్లె
గీ॥ ఇంతగాఁ బచ్చికలి నెన్నఁ ♦ డెఱుఁగ మార!
పెచ్చుపేఁగిరి తురకలు ♦ పేరుమాపి
ప్రజల యాపదలను బాపి ♦ బ్రదుకుఁదెరువుఁ
జూపి సత్కీర్తి వడయుము ♦ శూరమాళి!!

భరతఖండమునం దింక జవనిర్జితఖగరాజులుండఁగనే యీ తురకపాము లిట్లు తలలెత్తి యాడుటకన్న శోచనీయం బేమి కలదు? ఎంతయో దూరము పోనేల? మన తారాబాయి గతి జూడరాదా? సూరనాధుని త్యాగానము జాలదా? ఇప్పటికి నాచెన్నటు లావేదనగరము విడువలేదఁట. ఎంత ఘోర కృత్యములు గావింపుచుండిరి. వేయేల? వారెఱుఁగని మాయోపాయములును, వారు చేయని దుష్కృతులును లేనేలేవు.

తే॥ గీ॥ అరయఁ బదునాల్గు భువనంబు ♦ లందుగల్గు
శౌర్యమంతయుఁ రాశిగా ♦ జల్పి భరత

ఖండమునఁ బోయు విధియిటుల్ ♦ క్షత్రియులుగఁ
బుట్టిరది భిన్నముగఁ జేయఁ ♦ బోలునొక్కొ!

యోధాగ్రేసరా! ఏమి! అట్లాలోచించుచుంటివి?

పృథ్వీ— స్వామీ! ఆలోచించునదేమున్నది? ఇంతకుఁబూర్వమే వారి దుండగములు తారాబాయివలన విని చింతించి వైరి సంహారోపాయాన్వేషణము జేయుచునే యుంటిని. నేఁడు మీనుడువులు విన్న శిశువులుసైతము కటారులు గోరరా! క్షత్రియవంశ సంజాతుండనై, శౌర్యమే యుగ్గుపాలుగాఁ ద్రావిన నావిషమై నేను జెప్పఁగొన్నచో నాత్మస్తుతిగా నుండు నని సంకోచించెద. వేయేల!

శా॥ రాజస్థాన సరోవరంబునఁగడున్ ♦ రాజిల్లు నాపద్మినీ
రాజిన్ బట్టఁగనెంచు మ్లేచ్ఛ ధరణీ ♦ రాజేభముంగూల్తు నా
తేజంబొప్పఁగ రాజసింహుఁడనఁగా ♦ దీవించినన్ బంపుమీ
రాజానందమునీంద్ర! యాఖలుల ని ♦ ర్లక్ష్యంబుగాఁజెండెదన్.

రాజా- యోధాగ్రేసరా! నీవంతటివాఁడవే యగుదువు. ఢిల్లీఖాన్ శిరచ్ఛేదమును, తారాబాయి పాణిగ్రహణమును నీకుఁ గర్తవ్యములు.

పృథ్వీ- మహాత్మా! మీయాజ్ఞ శిరసావహించెద.

రాజా- రాజా! చెప్పమఱచితిని, నీసోదరుఁడగు జయమల్లుని యుదంతం బెఱింగితివా!

పథ్వీ- స్వామీ! ఆ దుర్మార్గుని ప్రసక్తి నాకేల? పోనిండు, సర్వము దెలిసినది. భ్రాతృద్రోహి యగు నాకుటిలుని గడ తేర్చి సూరనాథ మహీపాలుఁడు జగదుపకృతిఁ గావించినాఁడు. తమ్ముఁడైన నేమి! అన్నయైన నేమి! దుర్మార్గుఁడైనచోఁ దగిన ప్రాయశ్చిత్తము జేయవలసినదేకదా!

రాజా—[తనలో] ఆహా! ఇతఁడెంత సుధీనిధి! [ప్రకాశముగా] నీ శౌర్యముతోఁబాటు, నీసుగుణంబులుగూడ వర్ణనీయములు,

ఇఁక నీవుపోయి, నాకోరినయప్పుడు యుద్ధమునకు సన్నిద్ధుఁడవై యుండుము. ఇటనింకొక వీరాగ్రేసరుఁడు భిల్లులసైన్యమును గూర్చుచున్నాఁడు. ఆమహాత్ముఁడుగూడ నిన్ననుసరించును.

పృథ్వీ—చిత్తము. సెలవు గైకొనియెద. అల్లదే! నాయాప్తుఁడగు విజయుసింగుసైత మరుదెంచుచుండె. అతనినిఁ గలిసిపోయెద-

[అని నమస్కరించును]

రాజా—నీకన్నివిధముల సుఖములు గలుగుఁగాక- పోయిరమ్ము.

[పృథ్వీరాజు నిష్క్రమించును]

రాజా—నేతలఁచిన గార్యములెల్ల నిఁక ఫలించుననుటకు సందియము లేదు. కాలమెప్పుడో కేరీతుగా నుండునా!

[అని నిష్క్రమించును]

[షేంషేఖాను, ఇంకను మ్లేచ్ఛులు ప్రవేశింతురు]

షేంషే—అరే! ఇస్మాయిల్ ? హుకాలాబే!

ఇస్మా—సర్కార్, హుకుం కేతాబే, [అని తెచ్చియిచ్చును]

షేంషే—[హుకాద్రావుచు] అరే, ఇయ్యాల పానం నిండా ఆయాషం తల్గింది. భేజారు, భేజారు అయిందిగా మల్లి. ఏమి సేయాలా మల్లి. సర్కార్ హుకుం షేస్తాంఅంటె అట్లా ఉండయ్ బాబు. ఇది యెఖ్జాముండా ఉండాద్రయా! ఎన్కా దీన్కి పట్కానెటాన్కి చార్ జవానామణుసుల్ వస్తే ఆల్కి అల్లాఖాడ్కి రవానా షేసింది. ఇంతమడిసి మేం లోకమ్మె యిన్నాంలేదురా బాబు. అరే మగమడుసుల్కి జాస్తీభలం ఉంటే యేం షెయ్యాల మల్లి? (ఆలోచించి తల యూపి) మనదగ్గ బచాయిచోకావాలా అంటే సాగ్తది. దీన్కి తొ ట్లాగైన పట్కాని పోవాల. నవాబ్దీదగ్గ మేర్బానీ పుషోకా వాల. ఖాలీ చోడ్తుం మల్లి. మాఘూసారం సూడు మల్లీ

అసల్ గల్లంతు అయితాదియేమో! మన్ని యెఖ్డా, వుండది మాలు రేదు. మాకీ పంపించ్ని మదుసుల్ యింకా వచ్చావ్ లేదు. ఈళ్ళికూడా మర్గయా సేసాడు లేదుగందా!
(హుకా పీల్చి పొగ విడుచుచుండును)
(ఇర్వురు మ్లేచ్ఛులు ప్రవేశించి) సర్కార్ సలామ్.

పెంపే-(తనలో) ఆః మాటలోనే వచ్చారు. ఈళ్ళ ముఖంషూస్తే ఖొంచెం యెల్గుతానే వుండ్లె. మల్లీ యేంచేసి వచ్చారో! (ప్రకాశముగా) అరే! నాజరుద్దీన్! క్యా తోబ. బాతిని దోర్ఖాదు వుంది, లేదు- దోర్ఖాదు.

1-వ,— క్యాబోల్నా సర్కార్, బలేకష్టం సేసేంగా అయ్యా! తిర్గి తిర్గి పాణం ఖంద మీాద అయితావ్

2 వ,— సర్కార్ యీాయేషమిమ్మానడుంటే మాకీభి మక్కా రవానా సెయ్యాల ఉండేది. అల్లాకటాచ్ఛం సరింగా ఉండాయిగాం గాబతికివచ్చేటాన్కి అయింది.

పెంపే-ఖొండామడిసియేషం యెయ్యాల మని మేం సేప్పేము లేదురా.

1 వ,— ఖొండమడ్సి యేషం యేస్కాని యెల్లాంగాంగ బచా యిచ్చాం. నాదగ్రా పారాయి తల్గిపిచ్చేతల్కి ఖొండాముం డాఖొడ్కుల్ డోంగులోపడిపోయారుగాలయూ

పెంపే- ఈగోలా సాబ్ కైకూరే! ఆమడిసీకి సూశారు లేదూసూశారు!

2 వ,— ఆమడ్సి ఒక్టే! యింకాపేనా పెద్దషంగతుల్ బేటలాగాంగా?

పెంపే- [ సంతోషముతో ] అచ్ఛా! జెల్దీ బోలేరే! ఆలష్యం యెందుకు సెయ్యాల! మీాందపని షూస్కుందాం.

1 వ,— అబ్దు ఒక్డు దాడీబాగా సేశాడు. ఆదు యీాఖొండమడ్సుల్కి యెట్లా సెయ్యాల సెప్తాఉండాదు.

పెంపే- అరే! బద్మాష్! పగలామాటల్ సెప్తాదుయేరా! ముందు ఆమడ్సిజాడ సెప్పాలఅంటే!

2 వ,— సర్కార్ ! ఈడు యియ్యాల షేనా తాగాడు. మాట
సరింగా షెయ్యాలఅంటే లేదు వస్తాయి, మేం షెప్పుకుంటాం
షిత్తగించండి అయ్యా!

షెంషే— అచ్ఛా! నీకీ చెప్పురా,

2 వ,— ఒక ఖొండావాన్కి పట్కోని, బాగా తాగిపిచ్చి, ఖాస్తా
ఖాస్తా షేయం సేసుకొని, ఆమడిసి ఉండేజాడ కనిపెట్కు-
న్నాం.

షెంషే- బలే! ఆమీాందసంగతుల్

2 వ,— అఖ్డ ఒకముసలంటా, ఆడు, ఆడిదగ్గ మకాంషేసి ఉండది.
దాన్కి బాబుకూడ అఖ్డ ఉండాడు.

షెంషే—భేషక్. అచ్ఛా! ఉండయి. మీారుఇయ్యాలమాపిట్కి
దాన్కిపట్కోని యెల్లాల, గడ్బిడషేస్తే మోషం వస్తా ఉంటా
రులేదు. అప్డు పట్కోని యెల్లాల.

1వ—అచ్ఛాసర్కార్. మేల్కోని ఉండారు అంటే మర్గయాషేస్తార్.

2వ—మీాకీహుకుంపర కారం నడుసుకుంటాన్కి, ఉంఢ్డున్నాం

షేంషే—తక్కిన మన మడుసుల్కి జబర్దస్తీమేఉండాల, అనిసెప్పి
మల్లీమీారీప్డుయెల్లి, ఆడ్కి షారాయి తాగిపిచ్చాల.

1వ—షిత్తం-ఇంకానాల్గుబుడ్లు దయషేపిస్తే మల్లీతల్గిపిస్తాము- ముని
గాడి మఖాంకాడ పడ్గాషేస్తారులేదు. అల్గితల్గిపిస్తే పనిషుఖంగా
అయితాదిసర్కార్-

షెంషే—అచ్ఛా! నీఆలోచన్కి మెచ్చాం నీకీయీాషమచ్చరం షుబే
దారుయిపిస్తాం- పరిమోషన్ బడాయిస్తావుగాన్లే-

2వ—సర్కార్-కష్టంఅంతా మేంషేస్తే, ఈడుతాగ్తాఖాసుంటాడు
ఖొండామడుసుల్దిపేరు- ఈడ్డిఊరుమల్లి. నాకిపిల్లలమడిసిఉండాం
మాామీాందఅనుఘరం షూపించాల-

షింషే—చుప్-గోలనిండాషేస్తావ్- షూస్తాంబే- నాష్టాచేసి మీపని మీందఉండాల- మీకీపెల్వాయిచ్చాంయింకా-

[అనినిష్క్రమింతురు]

[సూరనాథుడు ప్రవేశము]

సూర—కట్టా! నాయనుంగుపుత్రి! బిసరుహనేత్రి! నాముద్దులమూట! నాలావణ్యపుకోట! ఎందు వెదకినను గానరాకున్నయదికదా! ఆహా! నాబ్రతుకెంతి యగచాట్లపాలయ్యె! భగవానుఁడా!

సీ. తరులార! చిలుక బి ♦ త్తరులార! కరులార!
వరకుమారి తెలుంగు ♦ నెఱిఁగినారె?
కవులార! భిల్లపుఁ ♦ గవులార! దేవదా
రువులార! పూర్ణేందు ♦ రోచిఁగనిరె?
అలులార? గండుగో ♦ యిలలార! పులులార!
కాంచిరే! గారాబు ♦ కాంచనాంగి!
వనులార! మత్తకే ♦ కినులార! మునులార!
వనజాక్షి నాబిడ్డ ♦ జనెనెయిట్లు!

గీ. చెంచుతొయ్యలులార! మో ♦ కొంచలార!
హరిణ తతులార! జక్కవీ ♦ తరుణులార!
బకములార! అరణ్యపు ♦ మెకములార!
తెలియరే! యిటుదెసమాలి ♦ తిరుగుబాల!!

అయ్యో! ఎవరును మాటాడకుండిరే! మీకును నాపైఁ గినుక బుట్టెనా! అమ్మా! మహిషాసురమర్దనీ! నీచరణదాసురాలిం జూపి యీదాసుంగాచిన నీవాసిబాసిబోవునా! నీ తేజ మెందుఁ దాఁగినది? నీమహాత్త్వమే నీటఁ గలిసినది? "పేరుగొప్ప యూరుదిబ్బ" అను సామెతను సార్థకపఱచెనా! మహిషాసురుంజంపి యాబిరుదు గొంటివో! నెల్లప్పుడుఁ గాఱుదున్నల బలిగొనుటచే నీకాపేరు వచ్చినదో తెలియకున్నది!

నీవు నిజముగా భక్త ప్రసన్నురాలవైనచో నన్నేల కాపాడవు! ఇది యంతయు మాయనాటకుల బూటకముగాని, నీవు శక్తివేయైనచో విమతులు నీయాలయ ధ్వంసము జేయునపుడు, నీశక్తి యెటుబోయి నది! ఆహా! నేనెంత వెఱ్ఱిని. ప్రమత్తుడనై దేవిని దూషించు చుంటి నే? అంబా! సుగుణకదంబా! విషాదోన్మత్తుడనై యాడినపలుకులు సరకుసేయక, మన్నించి రక్షింపుము. నామురిపెంపు పట్టిం జూపుము. హా! మునికుల తిలకా! నీ వెందుబోయితివి! ఇనుముంగూర్చి యగ్నిదే వునకు సమ్మెటపెట్లు" అనునట్లు నామూలమునఁగదా! నీవుగూడాఁ బిచ్చియెత్తినవానివలెఁ దిరుగవలసివచ్చె, ఛీ! యిఁక నీపాడు జీవితము పై నాకాసయేల?

తే॥ గీ॥ క్షితియుఁదొలఁగెను నాకూర్మి ♦ సతియుఁదొలఁగె
ముద్దుకొమరెయువీడె నా ♦ బుద్ధిచెడెను
బ్రతికి యింకను భువిలోన ♦ బావుకొనున
దేమికలదొక్కొ! చచ్చిన ♦ నిలకు వెలితె?

(అని మూర్ఛిల్లును.)

[ రాజానందయోగి ]

రాజా—

చం॥ తిరిగితినీవనంబున మ ♦ దీయ సఖిం ♦ గననెల్లచోటులే
తెరువున జాడగన్పడదు ♦ దీనతనీ నృపుడిప్డుభూమిపై
నొఱగెను దిక్కులేదిఁకన ♦ హా! చెలియా నసమేఁపు గాంతుఁబా
మరులఁగు మ్లేచ్ఛులామెఁగని ♦ పట్టుకపోయిరటంచు నెంచెదన్.

కం. లోకమునసెల్ల వనితల
నీకటు గారాగృహంబు ♦ నివసన మరయన్
నీకమనీయాకృతియే
కాకున్న గతంబు వేరు ♦ కలదే? చెలియా!

పక్షులలో నెల్ల మనోహరముగాఁ బలుకు జిలుకకు బంజరావాసం బిచ్చిన ట్టులయ్యె. కట్టా! మంచిదినంబులు బోడగట్టుచున్నవికదా! యని సంతసించుచుండ నింతలో నీవంత జేకూరుట చింతాపదంబగుటయేగాక, వింత పుట్టించుచున్నది. [ఆలోచించి] తురుష్కులీపె నెట్లుపట్టుకొని పోయిరి. ఇదియంతయు మాయగా నున్నదే? [తలయూపుచు] గడచినరేయియే యీపని జరిగి యుండఁబోలు! రాత్రి భిల్లులు త్రాఁగి తందనాలాడుచుండుట, శత్రువులు కనిపెట్టి యీపనిఁ జేసిరి. వీరు త్రాఁగుడు మానుటచేఁ గల్లుగీయుటఁగూడఁ గట్టిపెట్టిరే! వీండ్రకు గల్లెట్లువచ్చినదో! [యోజించి] ఆఁ తెలిసినది. ఆదుర్మార్గులే గొని వచ్చి వీరికిచ్చి, వశీకరముఁ జేసికొనిరి. ఓ దుండగులారా! నిద్రించు తఱినా మీామగతనముఁ జూపుట.

గీ॥ విల్లుచేఁబూని వచ్చినఁ ♦ దెల్లమగును
నెదిరిపోరాడ కిటుసేయ ♦ నేమిఫలము!
నిదురచే నొడల్మఱచిన ♦ నెలఁతనిట్లు
గొంచుపోవుట నరకంబుఁ ♦ గాంచుకొఱకె!

ముష్కర తురుష్కులారా! మీాకుఁ జేటుకాలము చేకూరం బట్టియే మీాకిట్టితుచ్ఛ గుణంబు లుద్భవించుచున్నవి. కానిండు నామనోహరు సాయంబున నాచెలిం దేకున్న నింకేమి బ్రతుకు! ఆనయశాలి యెట్టులైన నాసుదతిం గొనిరాఁగలఁడు. ఇప్పుడు తడవున కదనుగాదు. ఈయన మూర్ఛఁదీర్చి శాళికాలయము కడనుంచి కర్తవ్యమునకై నాథునిఁజేరెద. ఈ నరపాలునిపుడు ప్రాణేశు ప్రాపుఁజేర్చుటుచితముకాదు.

[అని రాజు మూర్ఛఁదేర్చును]

సూర—[లేచి కాళ్లపైఁబడి యేడ్చును]

రాజా— [లేవనెత్తి] రాజా! ఊరడిల్లు మూరడిల్లుము. ఆపదలు కాపురముసేయునా!

సూర—యతివర్యా! నాకుఁ బుత్రికాభిక్షఁ బెట్టుము. లేనిచో నేఁ బ్రతుకఁ జాలను. [చింతించును]

రాజా—రాజా! అట్లు వాపోయెద వేల? ఆపద వేళలం దేగదా! ధైర్య మూనవలయు! మానధనియగు నీపట్టి కేమియుఁ జెడుగు వాడమదు నేనిదే పృథ్వీరాజుకీవార్తఁ దెలుపఁ జారులనంపెద. వెంటనే యీ కంటకుల తుంటరితన మడఁగించి మనవాల్గంటినతండు జేకొనంగలండు. నీ విటకాళీయాలయముననే యుండుము.

[అని నిష్క్రమించును]

సూర—మాయొప్పులకుప్ప నెప్పగిదినైన నీతబిసితేఁడు జూపఁగలుఁగు నని ధైర్యము వొడముచున్నది. ఈ పనికేఁగుదెంచిన మొదలీ మహామహుఁడేగదా! మాపాలిటి భగవానుఁడై కంటికి రెప్ప వలెఁ గాచుచుండెను. ఆయన వచ్చుదనుక నీదేవిని స్తుతింపుచు నిచ్చటనేయుండెద.

[అని నిష్క్రమించును]

ఇది,

తృతీయాంకము,

సమాప్తము.

శ్రీ

కృష్ణపరబ్రహ్మణేనమః

# పృథ్వీరాజవిజయము.

## చతుర్థాంకము.

[ ప్రథమ రంగము: యుద్ధ విద్యాశాల. ]

( మదన మోహనుఁడు మఱికొందఱు భిల్లులు కూర్చుందురు. )

మద— భిల్లసోదరులారా ! నేఁడు వ్యూహములంగూర్చి చెప్పెదను. శ్రద్ధాళులై యుండుఁడు: పూర్వము మన భూపాలకులెల్లఱు వ్యూహములఁ బన్నియే శత్రుసైన్యముల నవలీలం దునుమాడు చుండెడువారు.

1వ,— అయ్యా ! వ్యూహమన నేమి ?

2వ— మన గురువుగారు బాగుగా యుద్ధములో నారితేరిన వారు సుమీ ! అన్నియుఁ దెలియును.

మద— వ్యూహమనఁగా శత్రుల కభేద్యముగను, మనకు శత్రువుల జయించుటకు సులభసాధ్యముగను, ఉండునటుల సేనల సందర్భానుసారముగా నిలువఁ బెట్టుట.

3వ— ఆలాగుననా ! అయితే తెలిసినది లెండు,

మద— ఒక్కొక్కటిగూర్చు విధముఁ జెప్పెద నాలింపుఁడు.

తే॥ గీ॥ సేనలన్నియుఁ జీలుచుఁ ♦ జిత్రగతులఁ
బరువులెత్తుచు వైరుల ♦ దరికిఁజేరు
కాలముననెల్ల ఖేకమై ♦ కవియునదియె
సూకర వ్యూహమందురు ♦ సూరివరులు.

4వ— అయ్యా! బాగుగ మనసున కెక్కలేదు, మాచేఁ బ్రతి వ్యూహమును జేయింపుఁడు.

2వ— తొందరేల! మనతోఁ జేయించుటకుఁ గాదా! చెప్పుట.

మద— ఓయీ! అతనిపైఁ గోపింపకుము. మీ కనుమానముగా నుండు విషయము లొకసారికి పదిసారులడిగి తెలిసికొనుఁడు.

అంద—చిత్తము! చిత్తము! [తమలో] ఆహా! మన అయ్యవారెంత నెమ్మదిగలవారురా!

మద—శత్రువుల నెదుర్కొనం బోవునపుడు, మన సైనికులందఱు సేనానాయకుని యుత్తరువుప్రకార మనేకభాగములుగాఁ జీలిపోయి, చిందఱవందఱగాఁ బరువెత్తుచు, శత్రుసేనసమీపించినతోడనే, మఱల నందఱుంగలిసి పగఱఁజెండాడుటయే సూకర వ్యూహము [అని చేయించును]

భిల్లు—మాకిది బాగుగనున్నది.

మద—మఱియొకటి చెప్పెదవినుఁడు.

తే॥ గీ॥ మొదటఁగనఁ గడుఁజిన్నదై ♦ పిదపఁజూచు
గొలఁదిఁ బెద్దదిగా సేన ♦ నిలిచియున్న
దానినే సూచియందురు ♦ ధర్మవిదులు
రిపులభేదింప సులభమీ ♦ రీతిఁజూడ.

తెలిసినదా! సేనాగ్రభాగమునఁ గడుసన్నముగా సూదిమొన నమర్చి, వెనుకకుఁ బోవుకొలంది, మిక్కిలి వెడల్పుగానుండు నటుల నమర్చినదియే, సూచీవ్యూహము. ఈ వ్యూహము శత్రులభేదించుటకుఁ జాల సులభము.

భిల్లు—బలే, ఇదియును బాగుగానున్నది- మఱియొకటి సెలవిండు-

మద—

తే॥ గీ॥ శత్రుసేన శతఘ్నుల ♦ సంగ్రహింపఁ
బాముగుంపులరీతిని ♦ బ్రాకిపోయి

మెరులొక్కించుక యేనియు ♦ నెఱుఁగకుండఁ
బట్టుటీ పన్నగవ్యూహ ♦ పద్ధతిసుమ !

భిల్లు—అయ్యా! మఱల సెలవిండు-

మద—పగతులు ఫిరంగులు కాల్చుచుండునపుడు, వారికొక్కింతయుఁ దెలియకుండ పాములవలె నేలంబ్రాఁకుచుఁ, బోయి హఠాత్తుగా వారి ఫిరంగులఁ బట్టుకొని వారిమీఁదనే కాల్పవలెను. ఈ వ్యూహములోఁ గడుజాగరూకతయు, నేర్పునుండవలెను-

భిల్లు—ఇది కడు నేర్పుగాఁ జేయఁగలము-

మద—భిల్లులారా! ఇంకను గలవు- క్రమముగా దెలిపెద- వినుడు-

భిల్లు—చిత్తము- అట్లే సెలవిండు-

మద- తే॥ గీ॥ అర్ధచంద్రాకృతిగ సేన ♦ లమరియున్న
నదియె యర్ధచంద్ర వ్యూహ ♦ మైదనర్చు
పెక్కుఁగలవింక వ్యూహము ♦ లెక్కలేక
పద్మమనఁగను, శకటంబు, ♦ వజ్రమనఁగ

పూర్వులలో, రాముఁడు, భీష్ముఁడు, అర్జునఁడు మొదలైనవారు ధనుర్విద్యయందుఁ గడుఁ బేరందినవారు

భిల్లు—అయ్యా! భీమయ్యా!

మద—గదా యుద్ధమునందాతఁడు సమర్థుఁడు. మఱియు

తే॥ గీ॥ పదియునాఱేండ్లు గలిగిన ♦ బాలుఁడయ్యు
జనకుఁడొక దెస యుద్ధంబు ♦ సల్పుచుండ
ధర్మజునియానననికేఁగి ♦ తమ్మిఁద్రొల్చి
పేరుగాంచిన యభిమన్యు ♦ పేరెఱుఁగరె?

పద్మవ్యూహ భేదనమునకుఁ గడునేర్పరితన ముండవలయును. భేదించుటయే కష్టము. భేదించి లోనఁజొచ్చినచో, దిరిగి వచ్చుట దుస్తరము! దానియందర్జునుఁడు గడునేర్పరి. అతఁడు

లేనితజీ, పాపమభిమన్యుఁడు తండ్రికి మాఱుగాఁ దాఁబోయి కౌరవులలో లెక్కలేని పెక్కువీరుల నుక్కడంచెను. కాని ద్రోణాదులాబాలుని మగటిమి కాఁగజాలక కుట్రఁజేసి తునిమిరి. అట్లన్యాయము జేయనిచో నాకౌరవుల నాతఁడొక్కఁడే సమయించెడివాఁడు. శ్రీకృష్ణుని మేనల్లుఁడు సామాన్యుఁడగునా!

భిల్లు—అయ్యా! అంత చిన్నవాఁడుగూడ యుద్ధము జేసెనా! ద్రోణుఁడన్నఁగా నెవరు?

మద—అర్జునుని ధనుర్విద్యాచార్యుఁడు. గొప్పశరవేదియగు నొక బ్రాహ్మణుఁడు.

భిల్లు—బాపనయ్యలకుఁగూడ యుద్ధము చేయుట వచ్చునా?

మద—చేయలేకేమి? పూర్వ మన్నివిద్యలను నేర్చి, దయా సత్య శౌచాది సద్గుణంబులుగలిగివర్తించువారినే బ్రాహ్మణులని పిలువసాగిరి. ఆవిషయములు పెక్కు గలవు తరువాత బోధించెదను.

భిల్లు—అయ్యా! అవునుగాని పాపమా బాపనయ్య పిల్లవాని నన్యాయముగాఁ జంపెనే. వీరలకెంత విద్దెయున్నను గుత్సితపు బుద్ధులు మాత్రము మానరుగదా!

మద—అందఱు నట్లుందురా! ఈ ద్రోణుఁడును మంచివాఁడే. కాని యప్పటికా దౌష్ట్యపుబుద్ధి జనించె.

భిల్లు—మీరెన్నియైన సెలవీఁడు, వారికంటె గొప్ప విద్దెకలవారు తదితర జాతులనున్నచో నెట్లయిన వారినివంచింప సమకట్టుదురు. తాము ప్రతిదినము మాకుఁజెప్పుచుండు కథలలో వినుచుఁడుట లేదా!

మద—ఓయీ! ఇప్పటికాలములో నట్టివారు వేన వేలున్నారు. కాని పూర్వమట్లుకాదు సుమా! ఏమైనను వారి నాశ్రయించినఁగాని, మనకు విద్య లభింపదు.

భిల్లు—అట్లెందుచేత ?

మద—మొదటినుండియుఁ దామే యగ్రజులమని, తదితర శాఖలవారికి మంచివిద్యలు లభింపకుండునటుల, కట్టుదిట్టములు జేయుచు వచ్చిరి.

భిల్లు—వారికీ దుర్బుద్ధులు జనించుటచేతనే, దైవము కినిసి మ్లేచ్ఛద వాగ్నిం బుట్టించి దానిచే శాస్త్రములన్నియు, భస్మీభూతముఁ జేయుచున్నాడని తలంచెద.

మద—[తనలో] వీరెల్లప్పుడు నడవులయందు నివసించు ననాగరిక జాతివారయినను, విద్యాభ్యాసనముచే నెంతలోనెంత బుద్ధిమంతులైరి. వీరిని ముట్టఁగూడదని నిరాకరించి మృగములరీతి ననాదరించుచు మనవారే పేండ్రను చేతులారఁ జెఱుపుచుండిరి. ఈ జాతులకన్నిటికి విద్యా బుద్ధులు గఱపి నాగరకత నలవరచిన చోఁ దక్కినవారికంటె వీరెక్కువ దేశమునకై పాటుబడరా! లేనిపోని శ్లోకములను గల్పించి, మాల మాదిగెలనియు ముట్టరాదనియు వారినీడ ద్రొక్కరాదనియు, బశువులరీతిఁ దోలుచు, నైకమత్యహీనముజేసి దేశానర్థము గల్పించుచున్నది నిక్కముగా నగ్రజులమని చెప్పుకొనువారిలోఁ గల బుద్ధిమంతులే. [ప్రకాశముగా] మీరు నిజము గ్రహించితిరి. ఐన నిప్పుడా ప్రసక్తి మనకేల? ఇంకను యుద్ధములో నేర్చుకొనఁదగిన సంగతులు వినుఁడు.

తే॥ గీ॥ శత్రుసేనల భేదించు ♦ సమయమందు
దమచమూపతి చెప్పిన ♦ క్రమమెఱింగి
పోవలయును వెన్నిచ్చి ♦ పాఱరాదు ;
ఎప్పటికినైన మృత్యువు ♦ దప్పఁబోదు !

కాన యుద్ధమునకుఁ బోవునప్పుడు, మనజీవితములు నేటితో సున్నగావలయు, పగతులకు నేటితో నిహసంబంధమైన వీడ

వలయునని మనోనిశ్చయము జేసికొనవలయు- మడిమఁ ద్రిప్ప గూడదు-

తే॥ గీ॥ మున్ను సంయుక్త మొదలగు ♦ పూవుబోఁడు
లే! రణంబున దురకల ♦ మీఱిపోరి
పేరుఁగాంచిరి మగవారి ♦ వేఱఁ జెప్ప
నేల! వారికి ననిలోన ♦ నెదురుఁగలదె-

మనపూర్వచరిత్రలు మీరు వినుచుండుటలేదా! వారి కీర్తికిఁ గళంకముఁ దేఁగూడదు-

భిల్లు—అయ్యా! మీరు సెలవిచ్చినట్లు జేయుదుము- మాకుఁ బ్రాణములపైఁ దీపిలేదనుసంగతి మీకెఱుంగరా!

మద—ఔను నిక్కముగా

క॥ మీలో నొక్కొక్కరెయూ
కూళలఁ బదిమందినైనఁ ♦ గూల్పఁగలరు నే
మీలావు నెఱుఁగనేయుఁక
నేలా! చెప్పంగ నొక్క ♦ టెఱుఁగుఁడు మదిలోఁ-

భిల్లు—దేవా! మేము నిజముగా నాపాటివారిమే యైనచో మీయనుగ్రహమే కారణము- ఇంకను మేమెఱుంగఁ దగినదేదియో సెలవిండు-

మద—

తే॥ గీ॥ కఱకుఁగత్తుల గుత్తుకల్ ♦ తఱుగవలయుఁ
బరశువులచేత నొడలెల్ల ♦ నఱుకవలయు
మోటుకఱ్ఱలచేఁ దలల్ ♦ మోదవలయుఁ
బామరుల నేమిచేసినఁ ♦ బాపమున్నె?

(రాజానందయోగి ప్రవేశించును)

భిల్లు—చిత్తము. అయ్యా! మన తపసితేఁడు దయచేసెను.

మద—(తనలో) ఆహా! నా ప్రాణేశ్వరి! ముమ్మూర్తుల మునిపుంగవునే పోలియున్నది. ఇప్పు డీపె యాకార మెంతవర్ణనీయము (ప్రకాశముగా) భిల్లులారా! మీరిక్రను బొండు. భోజనానంతరము మఱల రండు.

(చిత్తముని నమస్కరించి భిల్లులు నిష్క్రమింతురు)

రాజా—ఆర్యా! వందనములు.

మద—ఇష్టావాప్తిరస్తు. మనోహరీ! నీ బహిర్వేషము నన్నే మోసపుచ్చినది సుమీ! ఇప్పుడింత యాతురతతో వచ్చితివేల?

రాజా—ఏమని నుడువుదును. మఱల నాపదలు మన ప్రాపునకుఁజేరె,

మద—కట్టా! మఱల నేమికీడు వాటిల్లె?

రాజా—[చింతతో] మన తారాబాయిని తురకలు చెఱఁగొని పోయిరి.

మద—(ఆతురతతో) ఎప్పుడు?

రాజా—గడచిన రేయి.

మద—అట కావలియున్న భిల్లులేమైరి?

రాజా—అందఱును గాఢనిద్రఁ జెందియుండిరి.

మద—ఔరా! మోసము గల్లె. ఇప్పుడు కర్తవ్యమేమి?

రాజా—ఆర్యా! అట్లుకాదు. జయాపజయములు విధినిర్ణీతములు. మనలవారే జయించినచో తారాబాయి మనకు దక్కకుండుటయే గాక, యెన్నరాని యవమానము. ఎన్నియో బన్నంబులు గల్గు. మనమే జయించినచో నాదుండగులు తారాబాయికి ప్రమాదము గల్గింపక మానరు. అప్పుడు మనము తలపెట్టిన కార్యమంతయుఁ జెడును.

మద—నీవు చెప్పినది వాస్తవమే కాని, వేరొకరీతి నానాతిం దెచ్చుటెట్లు?

రాజా——నాకొక యూహ తోఁచుచున్నది. ఏమంటిరేని మనము యతీంద్రులన నెంతగౌరవమును, భక్తియును జూపుదుమో తురకలు ఫకీరులన, అంతభక్తియును, గౌరవమును జూపుదురు కాన, మీరా వేషముఁ దాల్చి, యానవాబును వంచించి, తారను కారాగారవిముక్తురాలిం జేసి కొనిరండు. ఇంతలోఁ బృధ్వీరాజున కీయుదంతం బంతయు నెఱిఁగించి, యుద్ధసన్నద్ధునిం జేసి, మాకడనున్న సైన్యమును గూడ సాయముగా నంపెద.

మద——సఖీ! నీయుక్తి కడు యుక్తియుక్తముగా నున్నది. నే నట్లే పోయి యాపని తప్పక నెరవేర్తును, భిల్లుల నిప్పుడే పృథ్వీరాజుకడ కంపెద.

రాజా——మీరు తారను జెఱవిడిపించిన వెంటనే వేదనగరము ముట్టడింపఁబడును.

మద——చెలీ! సూరనాధమహారాజెట నుండె?

రాజా——మనోహరా! ఆయనం జూడఁ బ్రేవులు తఱుగుకొనిపోవును. కంటికి మంటికి నేకధారగా విలపింపుచుఁ గుటీరముననుండె.

మద——అక్కటా! ఎంతవిపత్తు సంఘటిల్లె. కానిండు. దైవమే కలఁడు. విచారించిన ఫలములేదు. నీ వప్రమత్తురాలవై మెలఁగుచుండుము. నేనిదే పోయి కర్తవ్యమునకుఁ గడంగెద.

(నిష్క్రమింతురు)

---

## ద్వితీయరంగము.

(వేదనగరము——కారాగృహము)

తారా——[తనలో] అక్కటా! నాజన్మనక్షత్ర మెట్టిదోకాని, మాతృగర్భమునుండి భూమిపైఁ బడినదాది, అన్నియుఁ గష్టములే

కదా! నాజనన మాహాత్మ్యముచేఁ గాఁబోలు! కన్నతల్లి గతించె. గతించెఁబో! తల్లిలేని కొఱంతవాపి, నాజనకుఁడు నన్నుఁ గడు గారాబమునఁ గడుపులోఁ బెట్టుకొని, కాపాడు చుండఁ బాపపువిధి రాజ్యభ్రష్టు నేల చేయవలయు? చేసెఁబో! నీయడవులయందైన బ్రదుకుదమన్న నీదుండగులపా లేల జేసె? నాఁ డరణ్యములో నన్నీ దుర్మార్గులు బట్టి తేఁబ్రయత్నింప, దీనరక్షణపరాయణుం డగు పృథ్వీరాజ యోధాగ్రేసరుఁడు రక్షించె. ఇప్పుడు దిక్కెవ్వరు? వృద్ధుఁడగు నాజనకుఁ డెంత బొగలుచుండెనో కదా! కడుపునఁ బుట్టిన బిడ్డవలె నన్నుఁ గాపాడుచుండిన యా యతివరుం డెంత గుందుచుండెనో కదా! ఆయనను దర్శించినది మొదలు మాదుర్గాబాయిని సైతము మఱచితిని. ఏమైన నేమి? మఱల నీగతి చేకూరెఁ గదా! హా! దైవమా! నాకష్టమ్ము లెప్పు డీడేర్తువో గదా! తల్లీ! భవానీ! నీకన్న నాకిప్పుడు దిక్కెవరును గానరారు.

శా॥ కట్టా! దిక్కును మొక్కులేక యిటులన్ ♦ కారాగృహంబందునన్
జెట్టల్వెట్టఁగ నాయమే! భగవతీ! ♦ చేతంబునం గొల్చు న
న్నిట్టుల్ చిక్కులు వెట్టుటేల? యొకసా♦రే ప్రాణముల్ దీయుమీ
చుట్టంబైనను, పక్కమైన భువిలో ♦ జూడంగ నీవే కదా!

—: ధ్రువకోకిలావృత్తము :—

పగతు లిట్టుల బాధవెట్టఁగ ♦ భక్తురాలినిఁ గూరులై
తగునె? బ్రోవక మిన్నకుండుట ♦ ధర్మమూర్తివి కాళికా
జగముతల్లివటంచు నమ్మితి ♦ జాగుసేయక వేగమే
పగకులేంద్రకుమారి! శాంభవి! ♦ నావిపత్తులఁ దీర్పవే!

అల్లనాఁ డాయరణ్యమునందు నన్నుఁ గాపాడిన జగజెట్టి, ఈ దుండగీడుల గీటడఁగించి, నన్నుం జేపట్టెదనని వాక్రుచ్చె. ఈ నిర్భాగ్యురాలి కంతటిభాగ్య మేల కలుగు?

చ॥ జనకుఁడు దూరమాయె, నల♦సంయమిచంద్రుఁడు బాసె,నాఁడు నక్షా
వని దయఁగాచినట్టి జన ♦ నాథుఁడు గానకపోయె, నయ్యో! యీ
చెనఁటులు జేయు దుష్కృతులఁ♦జెప్పఁగఁజాలను భూమి నింక నా
మనికియె నస్థిరం బనుచు ♦ మానసమందుఁ దలంతు నక్కటా!

[గుల్నాంబీ వచ్చుటను గాంచి] అదిగో! ఆరక్కసిముండ వచ్చుచున్నది. ఇదియును రాజపుత్త్రిస్త్రీయేనఁట. ఛీ! దీని బ్రదుకుగాల! డబ్బునకై యాసపడి పాలవంటి కులంబును పాడుజేసికొని నీచులగు నీతురకల పాలఁబడినది. ఇంతకన్నఁ జచ్చిన మేలుగాదా! ముక్కుమూసికొనిన మూఁడుగడియలు పట్టును. (గుల్నాంబీ ప్రవేశము)

గుల్నా—చెల్లెలా! ఇప్పటికైన మనసు కుదిరినదా! ఎందుకుఁ జెడిపో యెదవు నామాట వినుము. ఇంతకంటె వైభవము ప్రాప్తించునా వెఱ్ఱిదానా!

తారా—ఓసీ! తురకబానిసా! నీబాసల నిఁకఁ గట్టిపెట్టుము. నోటికి వచ్చినట్లెల్ల ప్రేలకుము. నన్ను జెల్లెలా యని పిల్చి, పాపము నీపరువు నేల పోఁగొట్టుకొనియెదవు? ఊరుకొమ్ము.

గుల్నా—ఏమే! నీకు క్రొవ్వు బాగుగా బట్టినదే! అట్లయితే నీపని మూఁడుగడియలలో నగును. ఏమో పాటిబోటికదా! నా మాటఁ జెవి నిడకుందునా యని యింతవఱ కుపేక్షించితి. జాగరూకతగా నుండుము.

తారా—హఠాంతకారీ! పాకము ముదురనీయకుము. నీ యధీనము లోనిదాన నని తలంచుచుంటివి కాఁబోలు! నా కీప్రాణమన్నఁ దృణప్రాయము. నిక్కముగా నీవు స్త్రీజన్మ మెత్తుటచేత నే బ్రదుకఁగలిగితివి.

గుల్నా—ఏమీ! చెప్పవు! అంతటి శూరురాలవా? నామనోనాథుఁడు మీపై దండెత్తి, మీసైన్యంబుల దండాడునప్పుడు నీశౌ

ర్యము నెందుదాఁచితివి ? అప్పుడు మగవారిజోలికిఁ బోనని యు, నిప్పు డాడువారిం జంపననియుఁ బ్రతిజ్ఞఁబట్టితివికాఁబోలు! ఇప్పుడు నీవున్నది తొల్లింటి వేదనగరమని తలంచితివేమో ! కాదు ! కాదు ! ఖోరాన్నగరముగా నెఱుంగుము. నన్ను నవాబు ముద్దులముద్దియగాఁ దెలిసికొమ్ము. ఇచ్చట నుండువారు మ్లేచ్ఛసర్దార్లుగా దలంచుము.

తారా—ఓసీ ! తుచ్ఛురాల ! మొద్దువలె నొకచో బడియుండక బుద్ధిలేక తగుదుననుచు, ముద్దుభార్యనని చెప్పి, యేల నాకుఁ గర్ణకఠోరముఁ గావించెదవు ? నీ వేమైనను నీకు భయపడు దాననుగాను.

గుల్సు—పాపము ! కర్ణకఠోరముగానే యుండును. మనకిరువురకు సవతిపోరు కలుగుననియా ! శంకింతువు ! అట్లుకలుగదులే ! నీవిప్పుడాడిన మాటలన్నియు మఱచి, నెత్తిన బెట్టుకొని పూజించెదనులే భయుపడకుము.

తారా—పిసాళీ ! తోకదెగిన నక్కవలెనన్ను నీయంతజేయుటకెంత తంటాలుపడినను, లాభములేదు. ఇప్పటికి నేకూటికిఁబేదనైనను గులమునకుఁ బేదనుకొంటివా ! నిప్పునకుఁ జెదలంటుట యెందైనజూచితే ! ఎందుకాయాస పడియెదవు ? ఇఁక విశ్రమింపబొమ్ము.

గుల్సు—నవాబుగారే వచ్చుచున్నారులే ! నీపాట్లు కనఁబడును. తుదిగాఁజెప్పెదను. ఒకమాటవినుము. బాగుపడుటకిష్టపడుము. "సిరిరా మోకాలొడ్డకుము" [అనినిష్క్రమించును]

[నవాబు ప్రవేశము]

నవా—వహ్వారే ! దీనియొయ్యారమెంత రమణీయకముగా నున్నది.

ఉ॥ బంగరుబొంగరాలవలె ♦ భామకుచంబులు కంచుకంబునఁ
బొంగుచుఁ దొంగిచూచెడిని ♦ బోరొనరింపఁగఁ గేలుదోయితో

నంగన బంపెనోయనఁగ ♦ నంగజుఁడేనె! యటన్న భ్రాంతిచే
తం గుసుమాస్త్రము ల్మరుఁడు ♦ధాటిగ వేయఁగ నోర్వఁజాలమిన్.

అహా! చక్కనిచుక్కయగు నీబోటికి సాటియైన బోటి లేదను మాటసూటి. [తొంగిచూచి] కన్నీరుఁ గార్చుచున్నదేల? కాదు! కాదు!

తే॥ గీ॥ భాస్కరోదయ మైనంత ♦ పద్మమెటుల
బాయునో! హిమబిందువుల్ ♦ బళిర! అటులె
కాంత వదనాంబుజంబు నన్ ♦ గనినయంత
విడుచుచున్నది కన్నీళ్ళు ♦ వింతయేల!

(మఱల విని) ఎక్కిళ్లు పడుచున్నదేల! [ఆలోచించి] తన పూర్వవిపత్తులఁ దలంచుకొని కాఁబోలు! కుందుచున్నది. (సమీపించి) నారీమణీ! ఇంకను వగపేల? వేదపురపు మహి షివగు నీకుఁ గొదవయేమి?

తే॥ గీ॥ కోరినట్టివియెల్లఁ జే ♦ కూరు నీకు
జింతయేలను కాంత! నీ ♦ చిత్తమందు
ధనము, ధాన్యంబు, వస్తువుల్ ♦ తద్దగలవు
త్రాఁగి తలపోసికొనవచ్చుఁ ♦ దలిరుఁబోఁడి!

తారా—(తనలో) మొదట నీనీచుని సామవాక్యములచే మందలిం చెద. [వానితో] నీబిడ్డసమాననగు నాపై నేల దురూహఁ బెట్టుకొనియెదరు? కనిపెంచు మిమ్మువంటివారి కీ బుద్ధులు తగునా?

నవా—పిచ్చిదానా! నీయట్టి రాచపట్టిం జూచి మనము గట్టిచేసి కొని, తనపట్టివలె నెంచుపీటిఁడి, యీలోకమున నే కాదు; ముల్లోకములందు నుండరు. అనుడులు మానుము, కరుణఁ బూనుము.

మ॥ అలివేణీ! మదినమ్ము నిక్కము మదీ ♦ యానందసంపూర్ణ హృ
త్సలిలాగారమరాళగామినిగ నిన్ ♦ దథ్యంబుగాఁ జేతు నో
కలికీ! నేత్రసరోరుహంబుల సదా ♦ కావింతుఁ బూజన్ హిమా
చలసంస్తుత్యఘనస్తనీ! మరుఁడు దా ♦ స్వ్యం బాచరించున్ గదా!

శా॥ ఇంతీ! నాసతిచేత నూడిగముఁ జే ♦ యింతున్ గదే! మారుచా
దంతీ! డెందమునందు సందియమునం ♦ దన్ బోకు మాతాపితల్
చెంతన్ జేరి సపర్యఁ జేసెదరు నా ♦ చెల్లెండ్రు నక్కల్ మఱే
యింతుల్ గాని! విధేయులౌదురు చలం ♦ బేలే సతు ల్జేతునే!

తారా—ఈదుర్మార్గునికడనా! వినయోక్తులును, హితోపదేశములు నక్కఱకు వచ్చుట! [అని కోపము నభినయించుచు] ఏమంటివి?

నవా—చెలీ! నాపైఁ గోపమువచ్చినట్లున్నదే! మాటాడవేమి?

ఉ॥ మత్తగజేంద్రయాన! యిటు ♦ మానసమందునఁ గోపమూనినన్
జిత్తజుఁ గెల్చుటెట్లు? సర ♦ సీరుహనేత్రి! యనుగ్రహింపు నీ
చిత్తమువచ్చినట్లుగనె ♦ చేయఁగసిద్ధము సేవకుండ, నా
యుత్తముగమ్ము లెమ్మిఁక ర♦యమ్మునవిమ్ము కుచమ్ము లిమ్ముగన్.

(అని పట్టుకొనఁబోవును)

తారా—(తనలో) ఇఁక నీచెన్నటికి బుద్ధిచెప్పకుండిన స్మృతిమించి రాగమునఁ బడును. (ప్రకాశముగా) ఓరీ! తులువా! వైభవమును జూచి శరీర మమ్ముకొనుటకు నేను తురకయింటఁ బుట్టలేదు. ఉత్తమక్షత్రియకుల సంజాతనుగా నెఱుఁగుము. భరతఖండములోని మానవతులు పాతివ్రత్యమునకన్న వేరువైభవముఁ గోరరు. కావలయునేని, నాప్రాణములు దీసికొనుము. నీవిభవముఁ జూచి వీఁకడినై విమలయశోవలయితమగు క్షత్రియవంశమునకుఁ గళంకము దెత్తుననుకొంటివా? ఏల పిచ్చిభ్రమపడెదవు?

తే॥ గీ॥ హైందవాన్వయ సంభూత ♦ జైనస్త్రీలు
కూడుగుడ్డయు లేకున్న ♦ గొంతుపైనిఁ
గత్తివచ్చిన మానంబుఁ ♦ గాచుకొందు
రంచు నెఱుఁగవుకాబోలు ! ♦ నార్యదూర !

నవా—ఎట్టెటూ ! చాలవఱకున్నదే ! నీకొక పతియుండినచో గదా ! ప్రతివ్రతవై పేరుఁగాంచుట ! కన్యవగు నీకిప్పుడు పాతివ్రత్య భంగమేమున్నది ? కాన నన్నుఁ బతిఁజేసికొని పతివ్రతవుగమ్ము.

తార—

మ॥ చెడుగా ! నోటికి బుద్ధిఁజెప్పెదను శా ♦ స్త్రింబొందనీకిట్టులా
గడవుం బుద్ధులుపుట్టెఁ "జెట్టుచెడునా ♦ కాలంబునన్ గుక్కమూ
తులపిండెల్" జనియించు జందమున నో ♦ దుష్టాత్మ ! నీపాడువం
గడుపుంబోకలు మానకున్ననిఁక ని ♦ క్కంబౌను నీచానిలన్.

మనస్సాక్షిగా నెవరినివరింతురో స్త్రీలకు వారేపతులు అట్లు నామనసాక్షిగా వరింపనున్న మనోహరుఁడీవఱకే గలఁడు. వేయేల? తుదిమాటవినుము.

సీ॥ పరమసాధ్విని సీతఁ ♦ బట్టికొంపోయిన
ఖలరావణుండేమి ♦ ఫలమ్ముఁగాంచె ?
రమణీలలామ నా ♦ దమయంతిఁగోరిన
యలకిరాతునకేమి ♦ హర్ష మొదవె ?
భామినీమణియైన ♦ పాంచాలినింబట్టి
సైంధవుండేపాటి ♦ సౌఖ్యమొందె ?
పావనకన్యఁ బ ♦ ద్మావతిం జెఱబట్టి
యాసుదర్శనుఁడేమి ♦ యనుభవించె ?
గీ॥ అంతకంటెను మిగులుగా ♦ నందఁగలవు !
సూరనాథుని గామిరె యూ ♦ శూరకన్య !
తారకాబాయిఁగోరిన ♦ నోరితులువ !
వెలుఁగు దివ్వెను నార్పఁబో ♦ శలభముగతి !!

భూమిమీఁదఁ బత్యము నేటితోనే యేల సరిపెట్టుకొనియెదవు? దిక్కులేనిదాన నని యెంచుచుంటివేమొ!

నవా—ఈకన్నె యింత విపదవస్థలో నుండియు గడుసుందనపు నుడువులు విడువకున్నదే? ఇంతటితో నాస వీడవలదు. ఎంతకఠిన చిత్తురాల కైనను, వేఁడఁగావేఁడఁగా మనసు కరుగకపోదు. ఇప్పు డీఁక నీమెను బలుకరింపఁగూడదు. మరియొకసారి ప్రసన్నురాలిం జేసికొనెద. [ఇట్లు అనుకొనుచుండఁగా సేవకుఁడు ప్రవేశించి]

సేవ—సర్కార్! బడాఫకీర్జీ వచ్చి మస్థానంమ్మే బైఠాహై ఔర్ ఖామందులవార్కి ధర్షణం ఖోర్తావుండార్.

నవా—మంచిది. వచ్చుచుంటిని. (తిరిగిచూచుచు వెళ్ళును)

తాగా—ఇఁక నా కిచ్చట ముప్పుతప్పదు. ఆహా! నావన్నియుఁ గొంతెమకోరిక లయ్యెనా! తుట్టతుద కెట్టి కడగండ్లపాలు గావలసివచ్చినది. నేఁ డేమో నామనసునందు మఱల నాచెలిని జూతునసియు, నామనోహరుని దర్శనభాగ్యము లభించునవియు, నాతండ్రి చింతలు దీరుననియు నాసలు పుట్టుచున్నవే! (పెదవి విఱిచి) అట్లు జరుగునా! (ఆలోచించి) ఎన్ని యుగచాల్లు గలిగినను, నేనెంత దుర్మరణము ననుభవింపవలసివచ్చినను' భరతఖండస్థిత కాంతాజనసహజగౌరవమునకు లోపము దెత్తునా! దైవమే కలఁడు. (తెఱవాలును)

నవాబుదర్బారు.

(వజీరాలంఖాఁ ఇంకను గొందఱు తురకసర్దారులు)

నవా—ఆలంఖాఁ! మనఫకీర్జీ దయచేసినాఁడా?

ఆలం—సర్కార్! ఇంకను దయచేయలేదు. పిలిపించెద. (అని) గులామ్ (కేక వేయును)

గులాం—జీ! సర్కార్! క్యా హుకుం?

ఆలం—ఫకీర్జీని పిలుచుకొనిరమ్ము.
గులాం—షిత్తం. (అని వెళ్లును)
నవా—వజీర్ !

గీ॥ అల ఫకీర్చెప్పినది యంత ♦ యరసిచూడఁ
బొల్లుబోకుండ నుండెఁ, బూఁ ♦ బోఁడిమాటఁ
గూడ నడిగిన నేమిప ♦ ల్కునో ! యటంచు
నెద నొకించుక సందియ ♦ మేడిపించు.

ఆలం—సర్కార్! ఖామందులవారిమాట నడుగఁజంకెద రేల? ఆయన కడుయోగ్యుఁడుగా నున్నాఁడు. మనమీమాటనడిగినఁ గోప మూనక పోవుటయేకాక, కార్యముఁగూడ నెరవేర్పగలఁడు.
నవా—మంచిది. అడిగిచూతము.

[ ఫకీర్జీ ప్రవేశము ]

[ అందఱును లేచి సలాములు చేయుదురు ]

నవా—ఫకీర్జీ! ఈయాసనమలంకరింపుము.
ఫకీ—నవాబ్జీ! నిన్నుఁజూడ మాకెంతయో సంతసము గలుగుచున్నది. నీవు సచ్చరితుఁడవని యిదివఱకే వినియుంటి.
నవా—అయ్యా! నేనంతసుతికిఁ బాత్రుఁడనుగాను. మీయనుగ్రహ మున్నఁ జాలును. కాని, [ అని సందేహించును ]
ఫకీ—ఓయీ! ఏదియోచెప్పఁబోయి సందేహింపుచుంటివేల? మా కడ నీకేమిభయము! బిడ్డలయందుఁ దల్లిదండ్రులకెంతటి వాత్సల్యమో! మాకుమీయందునంతియే నీకేదియైనఁ గోరిక యుండెనేని యెఱింగింపుము. అల్లాతోడ్పడగలఁడు నీవెవఁడవు? నేనెవడను? అంతయు నల్లామహిమయేకదా!
నవా—స్వామీ! మన్నింతురుగాక, నాకువిజయము జేకూరినను, నామనసునకు సంతృప్తిలేదు.

ఫకీ—[యోగదృష్టినభినయించి] ఇఁకఁ జెప్పనక్కఱలేదు. సర్వము మనోగోచరమైనది. చెప్పెదవినుము వేదనగరపు పూర్వప్రభు వగు సూరనాథునుఁతుపై నీకు మనసు దగిలినదా లేదా?

నవా—(తనలో) ఈయన కేవలము, అల్లాయవతారమని చెప్పుటకు సందియములేదు. [ప్రకాశముగా] తమరు నుడివినదంతయు నిశ్చయమే. అష్టకష్టములుపడి, ఆపెనుబట్టి తెప్పించి, యిప్పుడు చెఱయందుంచితి. నామాటయనిన, ద్రాఁచుబాముపలె బుసలు గొట్టుచుఁ దిట్టును. అనేకవిధముల బోధించితి బోధింపఁజేసితి కాని, నాప్రయత్నములన్నియు, నాకన్నెపట్టుదల యనుజంఝూ మారుతములోని దూదిపింజె లైనవి.

ఫకీ—ఎంతమౌర్ఖ్యము! నిన్నువరించుటకిష్టములేదా! ఆకన్నెయనఁగా నెంత? స్వర్గములోనున్న రంభోర్వశులనైన నీకుఁజేకూర్తును. నీవంటివాఁడా పెకు వేయిజన్మములకైనదొరకునా!

నవా—రంభోర్వశులైనను దీనికిఁ బోలరు! కాన నెటులయిన,

తే॥ గీ॥ చెలిని జేకూర్పుమో ఫకీ ♦ ర్జీ! సలాము
లనయమును జేసి నినుఁగొల్తు ♦ నతులభక్తి
నిట్టు లడిగితినంచు నీ ♦ యెడఁదయందు
గోప మూనకుమో మ్లేచ్ఛ ♦ తాపసేంద్ర!

నన్నెట్టులైన ననుగ్రహింపవలయు. (పాదములపైఁ బడును)

ఫకీ—ఓయీ! ఈపాటి కర్జమున కింత వేఁడుకొనవలయునా? లే. లెమ్ము. నే మొదటనే చెప్పలేదా!

తే॥ గీ॥ చెలిమిఁ జేకూర్తు నీకును ♦ జెలువకిపుడు
దిగులుబడబోకు మిటువంటి ♦ చిగురుబోఁడు
లైదువందలమంది నీ ♦ కబ్బజేతు
నధిప! రంభోర్వశీ మేన ♦ కాదులనఁగ!

క॥ యతులకు రాజులు ధరణీ
పతులకు యతివరులు మేళ్ళు ♦ పచరింపరొకో!

క్షితినటులె మీకు, మాకు, సు
దతి నీపాల్సేయ మాకు ♦ ధర్మముకాదే ?

నీవంటి సుగుణాలంకృతుఁ జేతులారఁ జెడఁగొట్టుకొని వేరొక భూపతిని జేపట్టునా !

నవా—స్వామీ ! ఇప్పుడు గట్టెక్కితినని యనుకొంటి. మీఋణము నెట్లు తీర్చుకొందును? నాకీమేలు సేయ మఱియొకరి తరమగునా ! తమబోటివారికడఁ, బరమనోకర్షణవిద్య యుండు, నందుచే నెట్టి కఠినచిత్తులైనను, ఎంత దుర్మార్గులైనను, వశులగుదురు. మీ కసాధ్యమగున దీలోకమున లేనేలేదని చెప్పఁగలను.

ఫకీ—నీభక్తికి మెచ్చినారము. నీవచిరకాలములోనే సత్కాంతాసుఖ మనుభవింతువుగాక. తారాబాయి చేఁజిక్కిన దనియే య్యెంచుము. ఆపెకడకుఁబోయి మాటాడుచుండ నెవరైన నడ్డగింతురేమో ! కాన,

తే॥ గీ॥ హుకు మొసంగుము ధరణీంద్ర ♦ యువిదకడకుఁ
బోయి ధైర్యముగఁ జెప్పుదు ♦ "పూవుఁబోడి !
యింక నీమదిఁ గుందఁగ ♦ నేల ! చెపుమ !
ఘనతనొందిన "పృథ్వీశు ♦ కరము దొరకు."

నవా—నాపాలిటి అల్లా ! సలాములు. కార్యభారము నంతయు మీపైనే యుంచితిని. ఇదిగో హుకుమ్ తీసికొనుఁడు.

ఫకీ—అట్లే పొమ్ము. [జనాంతికముగా] ఈ ముచ్చుపై మచ్చుఁజల్లితిని. ఇఁక నాయిచ్ఛవచ్చినరీతి నామచ్చకంటికడ కేఁగవచ్చును. ఎటులైన నేటిరేయి మాయఁజేసి యట కాపరివాండ్రకు గల్లబొల్లికబుర్లుజెప్పి, మద్యపాన మహాదేవతాపూజా పరవశులఁ గావించి మా తారాబాయిని గట్టెంకించెద. బహిర్వేషమా! నీవు నాకెంతయు మేలుచేకూర్చితివి. ఇఁకఁ దడయఁ గూడదు-

రేపు తప్పక పృథ్వీరాజు వీరిపైదండెత్తివచ్చుట నిజము. త్వరలో స్వామికార్యము నెరవేర్చుకొనవలయును- ఆహా! నా ప్రాణకాంత నిరుపమాన బుద్ధిచాతుర్యముచేగదా! ఎట్టి దుర్ఘట కార్యమునైనఁ జేయగలుగుచుంటిని- దుర్గా! దుర్గమమగు నీయాలోచనమెంత శ్లాఘనీయము-

[అని నిష్క్రమించును]

నవా—గులామ్! హుక్కాలావ్.

గులా—షిత్తం సర్కార్ [తెచ్చియిచ్చును]

నవా—వజీర్! మన ఫకీర్జీ యెటులైన మనకార్యములు నెరవేర్పఁ గలఁడని నానమ్మకము-

ఆలం—సందేహమేమున్నది- ఆమహాత్మునకిది యొకలెక్క!

నవా—అట్లయిన రేపే, వివాహప్రయత్నములు సేయవలయును.

[ఇంతలో నొకచారుఁడు ప్రవేశించును]

చారు—సర్కార్! సలామ్!

నవా—ఏమిరా! వార్తలు.

చారు—సర్కార్! ఏమి సెప్పాల! కొంప మున్గింది.

నవా—బద్మాష్! అట్లు ప్రేలుచుంటివేరా!

చారు—షిత్తం. అయ్యా! పృథ్వీరాజు ఉండాడు, అంటా, ఆయనఖొండ మనుసుల్ దండు తీస్కొని రేపు యిక్డా లడయిపెయ్యాల వస్తా వుండాడు. అడ్వీఅంతా ఆళ్ళభర్గం ఉండై మల్లి.

నవా—వజీర్! పృథ్వీరా జెవఁడు?

ఆలం—సర్కార్! మేవాడ్ సార్వభౌముని కుమారుఁడు. కడు చండశాసనుఁడనియు, ధనుర్విద్యా విశారదుఁ డనియు నిదివఱకే విన్నాను.

నవా—తెలిసినది. తెలిసినది. వాఁడా! వాని కింతపొగరా! దీనిలో వాని కేమిసంబంధము? పెంషేయర్ ఖాన్ను బిలువఁ బంపుము. (సేవకుఁడు బోయి తీసికొనివచ్చును)

షేం పే.—సర్కార్ ! సలామ్.

నవా—పృథ్వీరాజు నెఱుఁగుదువా ?

షేం పే.—చిత్తము. అతఁడే తారాబాయిని పరిణయమాడఁ దలపెట్టి నవాఁడని దేవర కీవఱకే విన్నవించితి. కడు పరాక్రమశాలి యనియే యందురు కాని, మనముందఱ సాఁగునా వాని యాటలు !

నవా—అచ్ఛాషేంపేర్ ! నీవు పోయి సైనికుల నాయత్తపఱచి, సిద్ధముగా నుండుము.

షేం పే.—సర్కార్ ! మన కేమియు భయములేదు. ఆకొండముండ కొడుకులు తుపాకిమోఁత వినఁగానే బెదరి చెల్లాచెదరై పోదురు. వెనుక దారాబాయి కొఱకేఁగినప్పు డీమూఢులను మాటలతో బుట్టఁబెట్టలేదా !

ఆలం—అట్లనుకొని యజాగ్రత్తగా నుండఁగూడదు.

నవా—వాండ్రపొగ రణఁగించు టెంత ? సర్దారులారా ! మీరెల్లరు యుద్ధమునకు సిద్ధముగా నుండుఁడు. మన ఫకీర్జీని భద్రముగా కాపాడుఁడు. (తనలో) తారాబాయి కేలు బట్టనెంచుచుండ మఱల నడ్డుగలిగెనా ! ఇంతలోఁ దొందరయేల ? ఇంతకాలమాఁగినవాఁడను రే పాఁగలేకుందునా ! (అని నిష్క్రమించును)

[ఇద్దరు మ్లేచ్ఛభటులు]

1వ—అరే ! అల్లా ! ఎంతఘూపారం వచ్చాడ్రా ! బాబు ! ఎంతపెనే పరం తల్గిందిరా నాయనా !

2వ—అరే ! ఎథ్వా ! నీకీఫారా యిచ్చేదాన్కి గాద్రా ! ఆడు మోసం చేసింది.

1వ—అబ్బం ఎందుకురా ! నీకీతాగావు, నాకీతాగాను ఫండ్కానాం. నీకేఫారా తలాయిచ్చావులేదూ, నాకీతలా యిచ్చాంలేదూ,

2వ—అరే, ఆడు హిందూంమడిసి ఉండాడ్రా ! ఫకీర్ యేషంతగిల్పిచ్చాడు

1వ—అందర్కి దివానా పెసేడుగారా.

2వ—అరే, యేం సెయ్యాలా! అవతలా యెల్లుసెప్పామంటే, సర్కారుహుకుం దగ్గావుండాయి.

1వ—ఈడ్కి యేం సూస్కున్నాంగారా. యెన్క తారాబాయికి అడ్వినుంచి తెచ్చేటాన్కి యెల్లినప్పుడు-

2వ—అరే, ఆపగాకరం యెందుకు నవాబ్ గార్కి సెప్పావులేమగా

1వ—ఆయనహుకుం దగ్గావుండాయి యేంసెయ్యాల,

2వ—అవునుబే, మనమీంద నేరంయెద్కువస్తాయి. సర్కార్ హుకుంకు యెదురు సెప్పేటాన్కి కెయిసారూల్ వుండాదిమల్లీ.

1వ—దీన్కి అవతల పెట్టురా రేపు యుద్ధంసెయ్యాల అంతా మల్లీ

2వ—కానీబే, బాగా తినేటాన్కి ఉంటేనవాబ్ సాహెబ్, అన్నాన్కి ఉంటే అమీర్ సాహెబ్, యేమిలేకపోతే ఫకీర్ సాహెబ్ షస్తే మల్లీఫీర్ సాహెబ్.

1వ—తొంద్రాపడకురే సాహెబ్ [అటు నిటుజూచి] అరే మనం రేపు రేపు అనిసెప్తాఉండాం. తెల్లారిపోయిందిగాబే-

2వ—[శబ్దమువిని] అరే, ఆగడబిడ యేంటిరా! మనం ఫౌఘాయిచ్చి పాణం బచాయించుకుందాం జాబేజావ్ -

[నిష్క్రమించును]

ఇది,

చతుర్థాంకము,

సమాప్తము.

శ్రీ

కృష్ణగురుపరబ్రహ్మణేనమః.

# పృ థ్వీ రా జ వి జ య ము.

ప ం చ మా ం క ము.

[ఫకీరు వేషముతో నున్న మదనమోహనసింగు తారాబాయి ప్రవేశము. ]

తారా—(తనలో) ఈమహామహుఁ డెవ్వరో తెలియకుండె, నాపై నిట్టి ఫకీరున కకారణకరుణ గలుగుటఁ జూడఁ జిత్రముగా నున్నది. మ్లేచ్ఛుఁ డెవ్వఁడైన మఱల మోసముఁ జేయ నిట్లు నన్నుఁ గొనిపోవుచుండుట లేదుకదా! ఈయన కంఠస్వరము పూర్వము నేను వినినట్లే యున్నది. కానున్నది కాకమానదు, ప్రస్తుతము నన్నాఘోరరాక్షస మధ్యమునుండి కొనితెచ్చిన యీతఁ డెవ్వండైనను వందనీయుండె, (ప్రకాశముగా) అయ్యా! దైవమువలె నన్నుఁ గాపాడి యవ్యాజకృపఁ జూపుచున్న నీ కెవ్విధిఁ బ్రతికృతిఁ జేసి ఋణము దీర్చుకొందును?

ఫకీ—అమ్మా! ఈ నాచేయవలసిన కార్యము జేసితిని. ఇందు గొప్ప యేమున్నది?

తారా—అయ్యా! నాయనుంగుజెలి యగు దుర్గాబాయి యుదంతము మీకేమైనఁ దెలియునా?

ఫకీ—సోదరీ! మీజనకుండగు సూరనాథమహారాజును, నీప్రాణసఖి యగు దుర్గాబాయియు సేమముగా నున్నారు.

తారా—(తనలో) ఈయన నిజముగా ఫకీరువలెఁ దోఁచుటలేదు. మా యాప్తులలోని ముఖ్యుఁడుగా నున్నాఁడు. కానిచో న

న్నిట్టు జెఱనుండి, విడిపించుటయేగాక, నాజనకునియొక్కయు' దుర్గయొక్కయుఁ, గుశలవార్తలను నుడివె. తొందరపడనేల? ఇంకను విచారించెదఁ [ప్రకాశముగా] అయ్యా! పృథ్వీరాజ రాజచూడామణి విషయమై మీరేమైన నెఱుఁగుదురా?

ఫకీ—ఎఱుఁగ కేమి? ఆయన దర్శనభాగ్యముఁ గూడ నేఁడు మనకు లభించును. నేఁ డావీరాగ్రేసరుం డీమ్లేచ్ఛరాజు శీర్షఖండన మొనరించును. రేపట, మాపట సిపాణి గ్రహించును. —

తారా—(ఱిచ్చపడి సంతోషముతోఁ దనలో) ఏమీ! నాభాగ్యము! నాచేసిన నోములన్నియు ఫలించు దినములు వచ్చెఁగాఁబోలు! (ప్రకాశముగా) అయ్యా! మిమ్ము నిరంతరము మఱువక స్మరించుచుందును. నిక్కముగా మిమ్ముఁజూడ మామదన మోహానసింగును జూచినట్లే యున్నది.

ఫకీ—(తనలో జెఱునవ్వు నవ్వుకొని) అమ్మా! అయ్యదే! విగ్రహరంగస్థలము. తిలకించితివే? (వ్రేలితోఁ జూపుచు) వీరపురుషాగ్రేసరుండగు పృథ్వీరాజు పరబలంబుల నిశ్శంకముగా దూరి, నెత్తురులు చిమ్మియు, గుత్తుకలు ద్రెంచియు, గుండియలు ద్రుంచియు, నొసళ్ళు గ్రుమ్మియు, మకుటంబులు డొలిచియు, మదంబులఁజెఱచియు, గదల్చియు, నదల్చియు, నొత్తియు, మొత్తియు, బంచబంగాళము గావించుచుండె.

తారా—[అతి సంతోషమున జూచి] అయ్యా! ఆచెంతనున్న మఱియొకపురుషుఁ డెవరు?

ఫకీ—అతఁ డాయన సేనాని,

తారా—అయ్యా! మా మునిపుంగవుండు సైత మరుదెంచెనే? ఆహా! ఆమహామహుఁడు నిక్కముగా భగవంతుఁడే యని చెప్పవచ్చును.

ఫకీ—(తనలో నవ్వుకొని) అమ్మా! ఆలస్యమునకు సమయముగాదు. నీవును వీరపురుషోచితాలంకృతవు గమ్ము. సంగరరంగమున కేగి వారికిఁ దోడ్పడుదము.

చ॥ ఉఱువడి వచ్చుచుండెను మ ♦ హాంబుధిలోఁ బడు నేఱులట్లుగా
నరిబలపఙ్క్తు లల్లవిగో! ♦ యూ శమనాలయముం జొఱంగ వే
గిరపడుచుండ భూధవుఁడు ♦ గేలఁ గటారిని నూఁతఁజేసి స
త్వరముగఁ బంపుచుండెను బి ♦ తామహుదర్శనమందునట్లుగన్.

(నిష్క్రమించును)

[పృథ్వీరాజు, యోగి, విజయసింగు ప్రవేశము]

పృథ్వీ—యోగివర్యా! ఇప్పటికి పరిహృతవైరుల మైతిమి.

రాజా—రాజా! మీ యిరువుర ధనుర్విద్యా నైపుణ్య మతి వర్ణనీయము-

పృథ్వీ—ఆర్యా! మ్లేచ్ఛసేనాని, నా కుత్తుకపైఁ గత్తి నెత్తి వేయునంతలో నొక రాకుమారుండరుదెంచి, నా ప్రాణంబులం గాపాడి మఱలఁ గనబడడయ్యె. అప్పటినుండియు, నామన మాతనికడనుండి మఱలకున్నయది.

రాజా—[తనలో జిఱునవ్వునవ్వుచు] రాజా! అన్నియుం దేలును ద్వర పడనేల! అతని చిత్తముగూడ నీకప్పగించియే యుండెనేమో!

విజయ—సంగర రంగమందొక పకీను వైరివీరులఁ బెక్కఱనుక్క డంచె. ఆతని నిర్వక్రపరాక్రమముంజూడ నిక్కముగా గదన గాండీవియని తలంచితిని-

పృథ్వీ—అవునవును. నానుడివిన రాకుమారుం డాతని వెంటనేయుండె.

రాజా—మనపైనంత యవ్యాజకరుణగల్గి సహాయ మొనర్చినవారు మనల దర్శింపకయే పోదురా!

పృథ్వీ—ఆర్యా! తారాబాయి యుదంతమావంతయుఁ దెలియదయ్యె.

ఆక అకుదురక లోపె కేమి చెఱుపుచేసియుండరుక దా!

తే॥ గీ॥ ఎవరికేనీ రణంబొన ♦ రించినాఁడ
నెవరికైకె త్వత్పదములు సే ♦ వించినాఁడ
నెవరిఁజూచిన నాదేహ ♦ మినుమడించు
నట్టి సింహేంద్ర మధ్య! ♦ నాకబ్బునొక్క!

రాజా-రాకుమారా! ఆచక్కెరబొమ్మ నీకుఁదక్క నితరులకుఁదక్కదు. ఆపె కేమియుఁ గీడుఁగలుగదు- అచిరకాలములో నాభ్రమర కుంతలి నీచెంతఁజేరి నిన్నత్యంతసంతోషితస్వాంతుం జేయఁ గలదు-

పృథ్వీ—యతీశ్వరా! ఆబాలా జగచ్చూడామణీ స్ఫురద్రూపము గన్నులఁగట్టినట్టే యున్నదిసుమీ! ఆపెలావణ్యమునుం దిల కింపవలెనన్న నిక్కముగా రెండుకండ్లుజాలవు.

తే॥ గీ॥ బాలసొబగును జూడఁగాఁ ♦ బోలు! నింద్రుఁ
డక్షులను వేయినార్జించె ♦ నతివ నెన్నఁ
బోలు! నహిరాజు నన్నిఁటిఁ ♦ బొందెనోళ్లు
గలుగునురుగాక మధ్యంబుఁ ♦ దెలియఁగలదె?

రాజా—నేనిదే కొండొకపనిమీఁదఁ బోయివచ్చెదను. నేవచ్చుదనుక మీరిట నేయుండుఁడు. [నిష్క్రమించును]

పృథ్వీ—మిత్రమా! ఈ మహాత్మునింజూడ నాలోనాకేయబ్బురమగు చుండును.

విజయ—వీరిమాటదియే కాదు- రణరంగమునఁ బొడఁగట్టిన ఫకీరును, రాకుమారుఁడుఁగూడ నట్లేయాశ్చర్యమువొడమఁజేయుచుండిరి

పృథీ—ఆ రాకుమారుని మోముఁజూచి వేరుగా తారాబాయిమోముఁ జూడనక్కఱలేదు. అచ్చునఁబోసినట్లుండె. ఒకవేళ తారా బాయియే యైయుండునేమో!

విజయ—ఆపె సోదరుఁడు గాఁడుకదా !

పృథ్వీ—

చ॥ నవనవలాడు నంగములు ♦ నవ్యవిలాసముఁ జిల్కు మోము మా
నవవికచాబ్జనేత్రయని ♦ నామది సంశయమొందఁ జేసెడిఁ
యు వనులబారిఁదప్పి యెటు ♦ లాసతివచ్చునటంచుఁదోఁచు వెం
డి వనజగంధియున్నయగు ♦ లే నిజమంచుఁ దలంతు మిత్రమా!

[యోజించి] తారాబాయికి సోదరులుండెనని వినలేదే? యోగి వర్యుఁడే దేవి యుక్తిఁబన్ని యాబాలికఁ జెఱవిడిపించియుండ నోపు- విడిపించినఁ బురుషుండెట్లగు ?

విజయ—విదియనాఁడగుపడని విధుఁడు తదియనాఁడు తానే గనుపించుట యెఱుంగరా !

పృథ్వీ—అవును- మనయోగి ధైర్యముఁజెప్పి పోయెఁగదా !

విజయ—ఆఫకీరు మోమున మ్లేచ్ఛరూపావంతేనియు లేదుసుమీ ?

పృథ్వీ—"నివురుగప్పిన నిప్పువోలె"నున్న యాతనిచరిత్రము చిత్రమే !

తే॥ గీ॥ మూఁడుమూర్తుల నాతఁడు ♦ ముష్కరుఁడగు
మ్లేచ్ఛుఁ డనుమాట వట్టిది ♦ మేదినీశ
వంశజుండగు, శత్రుల ♦ వంచనంబుఁ
జేయ నారీతి వేషము ♦ వేయవచ్చు.

విజయ—మీనుడు లసత్యములు గావు. మీరు తారాబాయి యని సంశయించిన రాకుమారుఁడు నిజముగా తారాబాయియే యగును. ఫకీరు వేషముతో నున్న మహానుభావుఁ డట్లాపెను వీరపురుషాలంకృతునిఁ జేసి, రణరంగమునకుఁ దోడితెచ్చి యుండు. ప్రచ్ఛన్నవేషులుగానిచోఁ దుచ్ఛులగు మ్లేచ్ఛులవలన స్వేచ్ఛ తప్పునని యట్లు గావించియుందురు.

పృథ్వీ—అట్లే యగునని తోఁచుచున్నది. మునిచంద్రుఁ డింకను రాకుండెనే !

విజయ—(ఒక దిక్కుకై చూచి) దవ్వుననుండి యెవ్వరో జవ్వను లిర్వురు వచ్చుచుండిరి-

పృథ్వీ—అగును. వారి వెంట నిద్దఱు పురుషులుకూడ నుండిరి

విజయ—వారెవరో !

పృథ్వీ—అందు మాతారాబాయి యుండెనేమో !

విజయ—ఈవైపునకే యరుదెంచుచుండిరిలెమ్ము.

పృథ్వీ—ఇటులే వచ్చుచుండిరి తొందరపడనేల ?

విజయ—తురుష్కులన నేనేమో యనుకుంటిని గాని, వారి బడాయి లన్నియు, లడాయియందు నుడాయించునుసుమీ !

పృథ్వీ—సందియమేమున్నది !

చ॥ మదమెటుపోయెనో పనికి ♦ మాలిన భీరులరీతినందఱుఁ
జెదరిరి రాజుఁబట్టి వడి ♦ శీర్షముఁ గోయుచునుండ నద్దిరా !
యెదిరినవాఁడు లేఁడు బదు♦ కే యదియుఁ గనఁ "బేరుఁగొప్పయూ
రదియొకదిబ్బ" యన్నగతి ♦ యౌఁజుమీ ! మ్లేచ్ఛులశౌర్యమో సఖా !

తే॥ గీ॥ నల్లమందును గంజాయి ♦ కల్లుఁగనిన
నుండు తెగువ యొకింతయు ♦ నుండదు సుమీ !
రణమహారంగమందున ♦ రాజపుత్త్రి
కరఖరాసిని జూచినఁ ♦ దురకగమికి.

విజయ—సౌహృన్మణీ ! అదే ! ఇంతకుఁబూర్వము మనము గాంచిన వారలు సమీపించుచుండిరి.

పృథ్వీ—(చూచి సంతోషముతో) మిత్రమా ! సందేహమేమి ? అల్లదే తారాబాయి !

సీ॥ ఆననాంబుజసార ♦ మంద నేఁగియు వెండి
యేలొకో ! యెలదేటు ♦ లెగిరిపోవ
అధరబింబఫలంబు ♦ నాసించి చిలుకలు
దరిఁజేర నేటికో ♦ వెఱచిపోవ

నయనాంబుచరముల ♦ పయి నాసఁగలిగియుఁ
జక్రంబు లేలొకో ♦ జడిసిపోవ
భుజబిసంబులఁ జూచి ♦ ముదమంది యేటికో
మదమరాళంబులు ♦ చెదరిపోవ
గీ॥ గాంచన, సునాస, సాంకవ ♦ గంధి, చంద్ర
రుచిరుచిరహాస, ఘనవేణి ♦ రూపుఁగంటిఁ
దరుణి మఱియొర్తు వెంటరా ♦ మరునిదంతిఁ
బోలె నరుదెంచు నపరంజి ♦ బొమ్మ సఖుఁడ !

(సూరనాథుఁడు, మదనమోహనసింగు, దుర్గాబాయి, తారాబాయి)

(ప్రవేశము)

(పృథ్వీరాజ విజయసింగు లాశ్చర్యముతోఁ జూతురు)

పృథ్వీ—(తనలో) వీరిం జూడఁజూడ నాకుం గడుంగడు వింత వొడముచున్నది. ఈ నూత్నపురుషుఁడును, నాజవ్వనియు నెవ్వరో ! (ప్రకాశముగా సూరనాథునిఁ జూచి) అయ్యా ! ఈనూత్నపురుషపుంగవుఁడును, ఆ సాధ్వియు నెవరు ?

సూర—రాకుమారా !

మ॥ మునిరూపమ్మున మమ్ము నేలినది యీ ♦ పూఁబోఁడియే దుర్గ! సి
గ్గున మో మల్లదెవంచి నిన్నిపుడుఁ జే ♦ కోనెంచియున్నట్టి యా
వనితారత్నమె తార ! భిల్లులకు వి ♦ ల్వట్టఁగా గృప న్నేర్పి యి
ప్డసిఁ దోడై నఫకీరె నూ ! మదనమో ♦ హాఁసింగు పృథ్వీపతీ !

ఈ రాకుమారిక నాముద్దుకూఁతున కనుంగుఁజెలి, నాసేనానియు, స్వామిభక్తి పరాయణుండు నగు నీమదనమోహను ప్రాణకాంత,

పృథ్వీ—అహా ! వీరెంత ధన్యులు ! పార్వతీపరమేశ్వరులం బోలు నీ దంపతుల నెంత గొనియాడినం జాలదు,

[దుర్గవంక కుఁ దిరిగి]

సీ॥ రమణీలలామ తా ♦ రాబాయినిం గూర్చి
నను఼ గృతార్థునిఁజేయు ♦ మునివినీవె !
వైరిరాజులు గూఢ ♦ వార్తలఁగనుఁగొని
దునుమఁజేసిన మహా ♦ మునివినీవె !
పడరానిపాట్లెన్నొ ! ♦ పడి యరణ్యంబందు
ననుఁగుఁ జెలింగాంచు ♦ మునివినీవె !
సూరనాథు మఱల ♦ ధారుణీపతిఁజేసి
ఘనకీర్తిఁ గైకొన్న ♦ మునివినీవె !

గీ॥ చెలిమియును రాజవిశ్వాస ♦ బలముగలుగు
నల నృపానందయోగివై ♦ యలరితివె !
అహహ ! సోదరి ! నిన్నుఁబోలు ♦ నట్టిసుదతు
లవని యందననేల ? యా ♦ దివినిఁ గలరె ?

దుర్గ—పురుషోత్తమా ! నాహృదయేశ్వరు నేర్పుకలిమియు నీ సహాయములేకున్న నేనెంతదానను !

పృథ్వీ—ఆహా ! ఈపురుషుని యుద్ధనైపుణ్య మత్యంత వర్ణనీయము-

చ॥ మదనుఁడు వేయుబాణములు ♦ మానవకాంతలపైని మోహమే
మెద జనియింపఁ జేయునది ♦ యేమివిచిత్రము ! బాణవేది యీ
మదనుఁడు వేయుబాణముల ♦ మానవకాంతలమాని దేవతా
సుదతులఁగోరిరార ! రిపు ♦ శూరులు పీనిమహత్వ మెట్టిదో !

మద—శత్రుగజకంఠీరవా ! నేనెంతవాఁడను ? నీవు విజృంభించుచో,

తే॥ గీ॥ పాదములయందుఁ గూర్పక ♦ పాదు బ్రహ్మ
కుచములందేల కఠినంబుఁ ♦ గూర్చినావ
టంచు నీశత్రురాజుల ♦ యబలలజుని
నాడిపోయుదు రదియేమి ! ♦ యబ్బురంబో !

మ॥ అనతారాతి నదీప్రవాహము ననా ♦ యాసంబుగాదాఁటి నా
వినపంశోత్తమ ! సూరనాథుడలరఁ ♦ బృథ్వీపతుల్మెచ్చఁగా

మనతారాసతి మాటనిల్వ విల స♦న్మాన్యుండవై బాలికా
మణిఁ జేపట్టి కొఱంతఁదీర్పు మిఁక నై ♦ ర్మల్యాత్మ! భద్రంబగుఁగా.

పృధ్వీ—ఈ బాలికామణి నాఁటి నరకాసురయుద్ధము స్మరణకుఁ దెచ్చు చున్నది.

చ॥ నరకునితోడఁబోరి యదు ♦ నాథుఁడు మూర్ఛితుఁడైనయప్డు సం
గరమునసిల్చి దైత్యపతి ♦ కావరమూడ్చిన సత్యవోలె నీ
తరుణి తురుష్కనాయకుఁడు ♦ డగ్గరి నన్గడ తేర్పఁ జూచున
త్తఱిని గరంబుఁ ద్రుంచె వని ♦ తామణులందు నసాధ్యులుండరే.

తారా—[దుర్గతో] చెలీ! కృష్ణసాన్నిధ్యముచేతనేకదా! సత్యకంతటి శక్తి కల్గుట.

సూర—అవును. అమ్మాయీ! [పృధ్వీరాజునుజూపి] ఈ రూపురేఖ వయోవిలాసుండును, అవక్ర పరాక్రమాతిశయ జయశీలుం డును, సుగుణగరిష్ఠుఁడునగు నీపృధ్వీరాజు మనవైరుల నుక్కడంచి, పోయిన మనరాజ్యము మనకొసంగెను. గనుక తొలుత నే వీరాగ్రేసరుఁ డిట్టి మనకార్యముఁ జేయునో, అట్టివాని కిచ్చి నిన్నుఁ బరిణయ మొనర్పఁదలంచితి. కాన నీ సుగుణగరిష్ఠుని నార్యసమ్మతముగా వరించి మా కానందముఁ జేకూర్పుము.

తారా—తండ్రీ! మీయనుజ్ఞ శిరసా వహించెద.

పృధ్వీ—[తనలో] ఆహా! ఏమి! దైవసంఘటన మప్రతిహతము కదా!

తారా—[దుర్గ నుద్దేశించి]

తే॥ గీ॥ అనుఁగుఁజెలివన్న నీవెకా ♦ యతివమిన్న
పెక్కు కడగండ్లలోఁ జిక్కి ♦ స్రుక్కు నన్ను
నెట్టులోఁ గాచి యీజగ ♦ జెట్టి కేలుఁ
బట్టఁజేసితివోఁ గిర ♦ వాణి! కూర్మి.

దుర్గ— చెలీ! ఇందు గొప్పయేమున్నది? నావిధి నే నెఱవేర్చుకొంటి

సూర— దుర్గాబాయీ! తొలుత మాయుదంతము నీ వెట్లు తెలిసి
కొనఁగలిగితివి ?

దుర్గ— రాజోత్తమా ! సద్గుణ గరిష్ఠుఁడగు లక్ష్మణ భట్టువలన.

సూర— ఏమీ! ఆ మహాత్ముఁడు చాల గొప్పవాఁడు. మాకా
మహనీయుఁడు చేసిన మేలు మఱువఁ దగినదికాదు.

దుర్గ— చిత్తము.

సూర— [ మదన మోహనసింగునుజూచి ] యోధాగ్రేసరా! రేపు
కల్యాణ మహోత్సవము జేయుటయేకాక, పృథ్వీరాజును
వేదపురసింహాసనాభిషిక్తుం జేయువలయునని నాకోరిక.

మద— వయోవృద్ధులును, పుత్త్రసంతాన హీనులునగు మీరాలో
చించి చెప్పినది సమంజసమే.

పృథ్వీ— నన్నిప్పుడీ సింహాసనాసీనుఁజేయ సమకట్టకుఁడు. ఈభూపా
లపుంగవుఁడే యథాస్థితి నారోహింప వలయునని నాయభిలాష
ము. నేనెచ్చటనున్నను, ఇచ్చటనున్నటులే తలంపుఁడు. నే
నింకఁ బెక్కుకార్యములు నెఱవేర్పవలయు మీరు వేరొకరీతి
గా భావింపకుఁడు.

ఉ॥ మాళవదేశనాయకుఁడు ♦ మాటకెదుర్చుచు నప్పనంబులీ
సాలునఁగట్టియుండఁ డవ ♦ సానపు వేళనునిట్టి బుద్ధులీ
లీలనగల్గు, వానినవ ♦ లీలఁగబట్టి వధింతు దండనా
జాలును బుద్ధివచ్చెనని ♦ సన్నుతిఁజేసెడిదాఁక భూపతీ!

సూర— ఆ కార్యము నెఱవేర్చుకొనుటకై మీజనకుఁడేఁగుఁగద!

పృథ్వీ— రాజా !

చ॥ జనకుఁడుపోవనేల! యిటు♦స్వల్పపుగార్యమునందుఁగూడనేఁ
జన సరికాదె?

మద- శూరులకు ♦ సంగరమన్న వివాహమట్లగా

పృథ్వి- జనపతివంశవారినిధి ♦ చంద్రుఁడు నాపితసంతసించునేఁ| జనిన

మద- సమస్తకార్యములు ♦ జయ్యనఁదేలునటన్న యాసచే.

పితృవాక్యపరిపాలనము సజ్జన విధాయకముకదా! అట్లయిన రేపు వివాహ సన్నాహమే కర్తవ్యము.

సూర—పిండారఁబోసినట్లు జగమంతయు వెన్నెలగాయుచుండె.

తారా—

తే॥ గీ॥ కువలయమునకుఁ బగలొప్పఁ ♦ గూర్చెహితముఁ
దమ్ములకు భానుఁడది యేటి ♦ ధర్మమగును
గువలయ హితంబుఁ జేకూర్పఁ ♦ గూడునంచుఁ
దమ్ములని మొగమోటమిఁ ♦ దలఁపకాత్మ
రాజు పాలింపుచుండెనో ♦ రమణి! కంటె!!

పృథ్వీ— ఏమీ! ఈమె వాక్చాతుర్యము! ఎంత నైపుణ్యము శ్లేషించినది.

దుర్గ—తారా! తారానాధునకది సహజగుణమేకదా!

సూర—ఇప్పటికిజాముర్రాత్రియయినది. భోజనమునకేఁగుదమురండు.

[అని నిష్క్రమింతురు]

—* రంగము, వివాహ మంటపము. *—

[పృథ్వీరాజు, తారాబాయి, దుర్గ, మదనమోహనసింగు, విజయసింగు సూరనాథుఁడు బ్రాహ్మణులు]

సూర—[తారాబాయినిచూచి] అమ్మా!

సీ॥ మోహనాకారు నీ ♦ భూపాలుఁ జేపట్టి
ముదముఁ గాంచఁగదమ్మ ♦ ముద్దుగుమ్మ!
ఆనందభైరవీ ♦ యవతారమగుజెలి
చేయు మేళ్ల మఱపుఁ ♦ జెందకమ్మ!
భూపాలభక్తికిఁ ♦ బ్రోవైన మదనమో
హనసింగు నన్నగా ♦ నరయుమమ్మ!
తోడి భామినులు సం ♦ తుష్టిఁ జెందుచు నిన్ను
మెచ్చునట్టుల భూమి ♦ మెలఁగుమమ్మ!

గీ॥ కన్నడను మాటలేకయో • కరుణఁగలిగి
ప్రజలఁగాపాడి సత్కీర్తిఁ ♦ బడయుమమ్మ!
భైరవీ కృపనీకీ న్ను ♦ పాలవరుఁడు
దొరకె నీవంటబండెను ♦ వరకుమారి!!

[పృథ్వీరాజుందిలకించి]

ఉ॥ ఓనరనాథచంద్ర! భవ ♦ దుగ్ర పరాక్రమలీల వైరిసం
తానముద్రుంచి తత్పరిహృ ♦ తప్రథితంబగు రాజ్యలక్ష్మినిన్
బూనికనాకొసంగిన ప్ర ♦ పూత చరిత్రుఁడవంచు మత్సుతన్
గానుకగా నొసంగితిని ♦ గైకొనుమా! కొనుమా సుఖంబులన్.

—* భ ర త వా క్య ము. *—

చ॥ అవని సమస్తసస్యములు ♦ నభ్యుదయంబును గాంచుగాత మా
నవతుల కెట్టిభంగము నొ ♦ నర్పఁగ నీకవలోకనంబుఁ దం
డ్రివలె నొనర్పుచుండుత ధ ♦ రిత్రి విభుండు నిరంతరంబుఁ స
త్కృవులొనరించు గ్రంథములు ♦ గౌతుకముల్ గలిగించుగావుతన్.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

—* గ ద్య *—

ఇది శ్రీకృష్ణవరప్రసాద సమాసాదిత కవితాధౌరేయ,
సకల సుజనవిధేయ, దేవినేని వీరరాఘవ
నా మ ధే య ప్ర ణీ తం బై న
పృథ్వీరాజవిజయము
పంచమాంకము
సర్వము
స మా ప్త ము.

శ్రీ శ్రీ శ్రీ
శ్రీ